# వాల్మీకి రామాయణం - సంబంధాలు

# Valmiki Ramayanam - Sambandhalu

# వాల్మీకి రామాయణం - సంబంధాలు

డా॥ డి. నరసింహారెడ్డి
సంస్కృత విభాగము
ఎస్.వి. యూనివర్శిటి
తిరుపతి

సుదర్శన్ పబ్లికేషన్స్
తిరుపతి
**2000**

# VALMIKI RAMAYANAM - SAMBANDHALI



*by*

Dr. D. NARASIMHA REDDY



First Edition : Feb. 2000
Copies : 1000

*For Copies*

D. VASUNDHARA RANI
C/o. D. Narasimha Reddy
16-30 Muni Reddy Nagar
TIRUPATI

"This book is published with the financial assistar
TIRUMALA TIRUPATI DEVASTHANAMS under their
Aid to Publish Religious Books"

Price : 25/-

*Printed at*

STUDENTS OFFSET PRINTERS
Prakasam Road
TIRUPATI



డి. రాజమ్మ                డి. పకీర్ రెడ్డి

నాకు జన్మను ప్రసాదించిన

జననీ జనకులకు ప్రేమతో

అంకితం

# కృతజ్ఞతలు

రచనా వ్యాసంగమున ప్రేరణ కల్పించి నాకు అన్ని విధాల సహాయ సహకారములందించిన మా గురువర్యులు ప్రస్తుతం డైరెక్టర్ జనరల్ ఫార్ హైయ్యర్ వేదిక్ స్టడీస్ అట్ తిరుమల తిరుపతి దేవస్థానంలో యున్న ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్యుల గారికి

నాకు అన్ని విధముల సహాయ సహకారములందిస్తున్న మా సహోధ్యాపకులకు, మిత్రులకు నా రచనా సమయమున మనసా వాచా కర్మణా చేదోడు వాదోడుగా నున్న నా శ్రీమతి వసుంధరా రాణికి, ప్రత్యక్షంగా, పరోక్షంగా నా ఈ రచనకు కారకులైన వారికి.

ఈ పుస్తక రచనకు తగిన ఆర్థిక సహాయాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, చక్కగా ముద్రించిన స్టూడెంట్సు జిరాక్స్ వారికి.

*అందరికీ నా కృతజ్ఞతలు*

డి. నరసింహారెడ్డి

# ప్రస్తావన

భారతీయ సంస్కృతికి ఆకరవములనదగినవి రామాయణ మహాభారతాది మహా గ్రంథములే. వీటిలో రామాయణం ఆదికావ్యం. ఇందులోని పాత్రలు నాటి నుండి నేటికీ మానవ లోకానికి ఆదర్శవంతమైనవి.

"వాల్మీకి రామాయణం - సంబంధాలు" యను ఈ వ్యాసం రెండు భాగాలుగా విభజించడం జరిగింది.అందు మొదటి భాగంలో వాల్మీకి రామాయణం - ఆది కావ్యం, దాని ప్రాశస్త్యం చక్కగా వివరించబడినది. తర్వాత రామాయణంలోని రాజు, రాజ్యమునకు గల సంబంధం, మరియు రాజు, ప్రజలు, సేవకులు, భక్తులు తక్కిన వారికి గల సంబంధం వివరించబడింది. గురుశిష్యుల సంబంధం, తండ్రి - కుమారుల సంబంధం, అన్నదమ్ముల సంబంధం, సవతుల సంబంధం, తోడి కోడళ్ళ సంబంధం చక్కగా వివరించబడినది.

ముఖ్యంగా భార్యా భర్తల సంబంధం సవిస్తరముగా వివరించబడినది. నాటి దశరథుడు, కౌసల్య, కైకేయి, సుమిత్రల సంబంధం, సీతారాముల సంబంధం చక్కగా విశదీకరించబడినది. ఆనాటి సీతా రాముల సంబంధం నాటికి, నేటికి మానవులకు ఆదర్శవంతమైనదని వివరిచబడినది. మరియు ఊర్మిళా లక్ష్మణుల సంబంధం కూడ వివరించబడినది. ఈ రచన వలన నాటికి నేటికి ఆ సంబంధాలు సంఘంలో ఎంత ప్రముఖ పాత్ర వహిస్తున్నాయో మనకు చక్కగా గోచరిస్తుంది. రామాయణంలోని సంబంధాలు యావత్ బారతదేశానికే అతి ముఖ్యమైనవి, ఆదర్శవంతమైనవి.

ఈ వ్యాసం రెండవ భాగము నందు రామాయణంలోని నీతి వాక్యాలు వివరించడం జరిగింది. అవి ప్రధానంగా మూడు భాగాలుగా విభజించాను. మొదటిది : రాజనీతికి సంబంధించిన నీతి వాక్యాలు, వాటి వివరణ చేయబడింది. రెండవది : భార్యా భర్తలకు సంబంధించిన నీతి వాక్యాలు. మూడవది : ప్రజలకు సంబంధించిన నీతి వాక్యాలు. ఈ నీతి వాక్యాలకు వివరణ కూడ ఈయబడినది. ఈ నీతి వాక్యాలు మానవలోక వికాసానికి తప్పక తోడ్పడగలవని నేను భావిస్తున్నాను.

# విషయ సూచిక

## మొదటి భాగము

### వాల్మీకి రామాయణం - సంబంధాలు

## రెండవ భాగము

## వాల్మీకి రామాయణంలోని నీతి వాక్యాలు

# మొదటి భాగము

## 1. వాల్మీకి రామాయణం - ఆదికావ్యం

విశ్వసాహిత్యంలో శ్రీమద్రామాయణము ఆదికావ్యం. అది సంస్కృత వాఙ్మయమునకే గాక సర్వవాఙ్మయములకు ఆది కావ్యము. లౌకిక సంస్కృత భాషలలో ఛందో రూపమున వెలువడిన మహాకావ్యము. కావున ఇది ఆది కావ్యమనియు, దీనిని రచించిన వాల్మీకి ఆది కవి అనియు పేర్కొన్నారు. 2400 శ్లోకములు కల రామాయణం, బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ, ఉత్తరకాండయను ఏడు కాండాలుగా విభజింపబడినది.

శ్రీరామచంద్రుని ఆదర్శ చరిత్రమును వర్ణించుటచే ఈ మహాకావ్యము శ్రీమద్రామాయణమనియు, సమస్త నారీ లోకమునకు తన సౌశీల్య సచ్చారిత్రముచే ఆదర్శభూతమై సకల సద్గుణములకును నిలయమైన సీత పవిత్ర చరిత్రను వర్ణించుటచే ''సీతాయాశ్చరితం'' అనియు, దీన, సాధ్వీ, సాధు జనులను బాధించుటయే వృత్తిగా స్వీకరించి లోక పీడనము గావించుచు అధర్మ మార్గమున సంచరించిన రావణుని వధను వర్ణించుటవలన ''పౌలస్త్య వధ'' అనియును వ్యవహరింప బడుచున్నది[1]. రామాయణము తంత్ర, లయ

---

1. *కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్।*
   *పౌలస్త్య వధ మిత్యేవం చకార చరిత వ్రతః ॥*
   *శ్రీమద్వాల్మీకి రామాయణం, శివరామ శర్మవాశిష్ఠ. వారణాసి, 1957.*
   *బాలకాండ 4.7.*

సమన్వితమై గానయోగ్యమగుటచే 'గీత' అనియు[2], రఘువంశ చరిత్రమును వర్ణించుటతో పాటు ధర్మార్థకామ మోక్ష రూపములగు చతుర్విధ పురుషార్థములను వర్ణించుట చేత 'ఇతిహాసము' లేక చరిత్ర[3] అనియు, లోకోత్తరములను సరసములును అగు అర్థములను వర్ణించుటను బట్టి మహా కావ్యమనియు వ్యవహరింపబడుచున్నది.

వాల్మీకి రామాయణము నందు వలె భారతీయ గృహ జీవితమంత సమగ్ర సుందరముగ మరి ఎక్కడను వర్ణించబడలేదు. తల్లి, తండ్రి, భార్య, భర్త, కుమారుడు, కుమార్తె, అన్న, తమ్ముడు, వదిన, మరదలు, దాసి, యజమానుడు, సేవకుడు, మిత్రుడు, శత్రువు మున్నగువారు కుటుంబ మునకు సంబంధించినవారు. వీరు ఒకరి ఎడల మరియొకరు ఎట్లు ప్రవర్తింప వలెనో రామాయణమే మొదట చక్కగా విశదీకరించుచున్నది. భారతీయ సంస్కృతికి ఆధారమై దానిని సర్వప్రశంసాపాత్రముగ చేసిన కుటుంబ జీవిత సౌష్టవమునకు రామాయణము దర్పములాంటిది.

వాల్మీకి రామాయణము ద్వారా లోకమున కిచ్చిన సందేశము సర్వశిరోధార్యమైనది. సత్యధర్మములు ఎన్ని ఆటంకములకు గురియైనను చివరికి విజయమును పొందును. సీతారాముల వృత్తాంత మిందులకు మంచి నిదర్శనము. త్యాగము ప్రశంసనీయమైన గుణము. దీనిని ప్రచారము చేసిన

---

*2. అభిగీతమిదం గీతమ్. బా.కా. 4.27.*

*3. మహానుభావం చరితం నిబోధత. అందులోనే. 4.30.*

వారు శాశ్వతమైన కీర్తిని పొందుదురు. రాముడు లక్ష్మణుడు భరతుడు చేసిన త్యాగము చాలా గొప్పది. అందువలననే వారి కీర్తి నేటికి అజరామరమై విరాజిల్లుచున్నది.

రామాయణమున కథా సన్నివేశములు సూచించు ఈ సామాన్య నీతులేగాక రాజనీతి కూడ విశదీకరించబడినది. ఇది చిత్రకూటమునకు వచ్చిన భరతుని రాముడు పరిపాలనము గూర్చి వేసిన ప్రశ్నల వలన తెలియు చున్నది. కావున ఇది సంస్కృత వాఙ్మయమునకే గాక ఇతర వాఙ్మయములకు కూడ మూలభూతమైనందున ఇతి ఆది కావ్యమని పండితలోకమంతయు తెలియజేయుచున్నది.

## 2. వాల్మీకి రామాయణం - ప్రాశస్త్యం

రామాయణం భారతీయుల (హిందువుల) ప్రమాణ గ్రంథం. అందలి కథతోను, పాత్రలతోను కొద్దిపాటి పరిచయము లేని భారతీయులెవ్వరు ఉండరు. వాల్మీకి రామాయణమునకు లోకమున ప్రశస్తి కల్గుటకు అది అవతారపురుషుడగు శ్రీరామచంద్రుని చరిత్ర అగుటయు, దానిని ఆదికవి యైన వాల్మీకి రచించుట మాత్రమే గాక మరికొన్ని ఇతర కారణములు గూడ యున్నవి. పూర్వ లాక్షిణికులు కావ్యము యశోధనములు కూర్చు ననియు, వ్యవహార వేత్తృతను కల్గించుననియు, అమంగళమును నాశనము చేయు ననియు, సద్యఃపరనిర్వృతి నాపాదించుననియు, కాంతాసమ్మి తత్వముచే సదుపదేశము నొసంగుననియు, తత్ప్రయోజనములను చెప్పి యున్నారు[4]. ఇతర కావ్యములు వీనిలో కొన్ని ప్రయోజనములను మాత్రమే సమకూర్చు

---

4. *కావ్యం యశస్సేర్థ కృతే వ్యవహారవిధే శివేత రక్షతయే।*
*సద్యః పరనివృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే॥*
*కావ్య ప్రకాశము. మమ్మటుడు, వారణాసి, 1969.1-2.*

జాలును. అన్ని ప్రయోజనములను సమకూర్చగలుగునది శ్రీమద్రామాయణ మొక్కటియే. దీనిని పఠించిన సర్వ వ్యవహార వేత్తయగుననుటలో సందేహము లేదు. ఇప్పటికిని క్లేశ, అమంగళ పరిహారమునకు భారతీయులు సామాన్యముగ శ్రీమద్రామాయణమును విశేషించి సుందర కాండమును పారాయణము చేయుదురు. మరియు దీనిలోని ప్రతికాండమునందును ఉపదేశరత్నములు కలవు.

రామాయణ మహాభారతములు మానవ జీవితాన్ని ప్రభావితం చేసినట్లుగా మరే గ్రంథం చేయలేదని జవహర్ లాల్‌నెహ్రూ తాను రచించిన 'ది డిస్కవరీ ఆఫ్ ఇండియా' లో పేర్కొన్నాడు. "I do not know of any books, any where which have exercised such a continuous and pervasive influence on the mass mind as these two (Ramayana and Mahabharata). Dating back to a remote antiquity they are still a curing force in the life of the Indian people not in the original Sanskrit, except for a few intellectuals but in translations and adaptations and in those innumerable ways in which tradition and legend spread and become a part of the texture of a people's life.[5]

భగవాన్ వాల్మీకి తన రామాయణం ద్వారా గృహస్థాశ్రమ ప్రాశస్త్యమును నిరూపించుచు అందలి మాధుర్యమును పాఠకులకు తెలియజేస్తూ అట్టి ఆశ్రమ

---

5. *The Discovery of India P. 99.*

సాఫల్యమునకు సంపూర్ణమగు అనుశాసన పాలనము ఎట్లు ఆవశ్యకమో నిరూపించి అట్టి అనుశాసనమునకు కట్టుబడినవాడు ఎట్టి కష్టములనైనను అధిగమించగలడని చక్కగ నిరూపించినాడు.

గృహస్థాశ్రమమును ఒక రథముతో పోల్చిన అందు భార్యాభర్త లిరువురును ఆ రథమును లాగు గుఱ్ఱముల వంటివారు. ధర్మము ఆ రథమును నడుపుసారథి, అర్థకామమయ మగు సంసారము దాని మార్గము. మోక్షము గమ్యస్థానము. ఈ విషయమును వాల్మీకి రామాయణమున వివరించి యున్నాడు. సమాజము – వ్యక్తి, రాజు–ప్రజలు, కుటుంబము – అందలి సభ్యులు, వారికి పరస్పరముండవలసిన సంబంధ బాంధవ్యములు, వారు పాటింపవలసిన సామాజిక ధార్మిక కర్తవ్యములు మొదలగునవి చక్కగా నిరూపించి, వారి మధ్య సంఘర్షణము లేకుండుట విశ్వశాంతికి దోహదము చేయునని రామాయణమున చక్కగా ప్రతిపాదించబడినది. మానవుడు భౌతిక, ఆధ్యాత్మిక అభ్యుదయములను సాధింపవలెననిన, కామక్రోధా దులకు వశముగాక యుండవలెనని వాల్మీకి తన కావ్యం ద్వారా తెలియ జేసాడు.

మరియు ధర్మపాలనమున అర్థకామ ప్రాప్తి కలుగుననియు, ధర్మమునకు అసాధ్యము ఏదియును లేదనియును[6]. ధర్మము సర్వసుఖ మూలమని యును, ఈ ప్రపంచమంతయును ధర్మసార భుతమనియును, అట్టి ధర్మమును

---

6. *ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ప్రభవతే సుఖమ్।*
*ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్॥*
*అర. కా. 9.30.*

ఆచరించుట కష్టసాధ్యమైనను, మానవునకభ్యుదయ హేతువగుటచే ధర్మ మార్గమును మేధావులందరు అనుసరించి మానవ జన్మను సార్థక మొనరించు కొనవలెనని ఈ రామాయణం ద్వారా వాల్మీకి తెలియఁజేసాడు[7].

వాల్మీకి ఉత్తరకాండమున రామాయణం యొక్క వైశిష్ట్యమును గూర్చి ఇట్లు చెప్పెను. ఈ రామాయణము బ్రహ్మచే పూజింపదగినది. ఇది భగవత్సంబంధమైనది. కావున దీనిని దేవతలు, గంధర్వులు, మునులు స్వర్గమునందును సర్వదా సంతోషంతో వినుచుందురు[8]. ఈ రామాయణ కథను చదివిన వారికి ఆయుష్షు వృద్ధి చెందును. పాపము నశింపజేయును. సౌభాగ్యమును ఇచ్చును. ఇది వేదముతో సమానమైనది. శ్రద్ధా కాలము నందు వినదగినది[9]. పాద మాత్రమైనా పఠించినచో సంతానము లేని వారికి సంతానము కల్గును. ధనము లేని వారికి ధనము కలుగును. సమస్త పాపములు సమసి పోవును[10].

---

7. *ఆత్మానం నియమైస్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నత।*
*ప్రాప్యతే నిపుణైర్ధర్మో నసుఖాల్లభ్యతే సుఖమ్॥*
*అర. కా. 9.31.*

8. *తతోదేవాః సగంధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః।*
*నిత్యం శృణ్వంతి సంహృష్టాః కావ్యం రామాయణం దివి॥*
*ఉ. కా. 111.3.*

9. *ఇద మాఖ్యాన మాయుష్యం సౌభాగ్యం పాపనాశనమ్।*
*రామాయణం వేదసమం శ్రాద్ధేషు శ్రావయేద్బుధః॥*
*అందులోనే 111.4.*

10. *అపుత్రో లభతే పుత్రం అధనోలభతే ధనం।*
*సర్వపాపైః ప్రముచ్యేత పాద మప్యస్యయః పఠేత్॥*
*అందులోనే 111.5.*

రామాయణమును పఠించువాడు కొడుకులతోను, మనుమలతో, సంపదలతో కూడి సుఖపడును. అంత్యమున వైకుంఠమున శాశ్వతమైన సుఖమును పొందును[11].

## 3. వాల్మీకి రామాయణం - పాత్రలు

ప్రపంచమున భాష, నాగరికత అనగా ఏమో ఎరుగని స్థితిలో ఉన్నపుడే భారతీయ మహర్షులు వేద మంత్రములను దర్శించి లోకమున ప్రవర్తింపజేసిరి. అందు నిక్షిప్తములైన ధర్మనీతి తత్త్వములను సామాన్య జనులకు అర్థం చేసుకొనుటకు కష్టమగుటచే వానిని సర్వజనులకు సులభముగ బోధించుటకై వాల్మీకాది మహర్షులు లౌకిక సంస్కృత భాషలో కథోపాఖ్యానమయములైన కావ్య పురాణ, ఇతిహాసములను రచింపనారంభించిరి.

సంస్కృతమున లౌకిక భాషలో వ్రాయబడిన ఆరంభ వాఙ్మయమంతయు వేదార్థోప బృంహణార్థము వ్రాయబడినదే అని చెప్పుట అతిశయోక్తి కాదు. ఆ వాఙ్మయమున కాలము చేతను, గుణ గణముల చేతను అగ్రగణ్యత వహించినది శ్రీమద్రామాయణము. అటువంటి గుణగణములు కల్గిన రామాయణంలోని పాత్రలు వారి సంబంధాలు గురించి తెలుపడమే నా ముఖ్యోద్దేశం. ముందుగా అందులో గల పాత్రలు గురించి సంక్షిప్తముగా

---

*11. ఏత దాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం నరః।*
*నపుత్ర పౌత్రో లోకేఽస్మిన్ ప్రేత్యచేహ మహీయతే॥*
*ఉ.కా. 111.8.*

నిందు తెలియజేయుట సముచితము. రామాయణంలోని ముఖ్యపాత్రలు క్షత్రియులు (స్త్రీలు-పురుషులు), ఋషులు (స్త్రీలు-పురుషులు), వానరులు, రాక్షసులు అని విభజింపవచ్చును. క్షత్రియులందు దశరథుడు, శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, సుమంత్రుడు, కౌసల్య, కైకేయి, సుమిత్ర, సీత, ముఖ్యులు. ఋషులందు వశిష్ఠుడు, భరద్వాజుడు, శబరి, అనసూయ ప్రముఖులు. వానరులందు హనుమంతుడు, సుగ్రీవుడు, తార, రాక్షసులందు రావణుడు, విభీషణుడు, మారీచుడు, మండోధరి, త్రిజట మున్నగువారు ప్రధానమైన వారు.

## 4. వాల్మీకి రామాయణం - సంబంధాలు

వాల్మీకి మహర్షి రామాయణమునందు భారతీయ జన సమాజమును, వారి మహోన్నత సామాజిక, ధార్మిక, రాజ, నైతిక ఆదర్శములను వివరించి ధర్మార్థకామ సంయుక్తమైన వారి జీవన విధానమును, దాని వైశిష్ట్యమును తెలిపెను. అట్లే ధర్మ సహితములైన అర్థకామములనే సేవించు రాక్షస సమాజము యొక్క కుత్సిత స్వరూపమును చిత్రించి మానవులను ధర్మ బద్ధము, మంగళ మయము అయిన జీవన విధానము వైపు మరల్చెను. ధర్మ పాలనమున అర్థకామ ప్రాప్తి కలుగునని, కేవలం అర్థకామముల నాశ్రయించు వారు సమూలముగా నశించుదురని చాటినాడు.

*ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ ప్రభవతే సుఖమ్।*
*ధర్మేణ లభతే సర్వం ధర్మసారమిదమ్ జగత్॥*

మానవ జీవిత మహత్త్వంతోబాటు దాని క్షణ భంగురత్వం కూడ చాటినాడు. కావున శ్రీమద్రామాయణము భారత జాతి సర్వస్వ మనదగియున్నది. మరియు భారతీయులకు రామాయణము వేద ప్రమాణ మైనది.

వాల్మీకి ప్రణీతమైన శ్రీమద్రామాయణము నందు రాజ్యపాలన, రాజనీతి, రాజు రాజ్యమునకు గల సంబంధం, రాజుల గుణగణములు, ఇతరులతోడి రాజుల సంబంధాలు, వారి పరిపాలనా నైపుణ్యం, పితృభక్తి, గురు భక్తి, పెద్దల యెడ గౌరవం, గురుశిష్యుల సంబంధం, అన్నదమ్ముల అనుబంధం, తండ్రి తనయుల ప్రేమానురాగాలు, వియ్యంకుల స్నేహ భావం మున్నగు అనేక విషయములు సమగ్రముగ వివరించబడినవి. మరియు రసపోషణ, భావములు, అష్టాదశ వర్ణనలు, తాత్వికాంశములు గూడ సమూలాగ్రముగ వివరించబడినాయి.

ముఖ్యముగ రాజునకు రాజ్యమునకు గల సంబంధం, రాజు-ప్రజల సంబంధం, రాజు-సేవకుల సంబంధం, గురుశిష్యుల సంబంధం, అన్నదమ్ముల సంబంధం, అత్తాకోడళ్ల సంబంధం, భార్యాభర్తల సంబంధం మరియు అనేక విధములైన సంబంధాలను గురించి తెలియజేయడమే యీ రచన ముఖ్యోద్దేశము. ఆనాటి నుండి ఇప్పటి వరకు రామాయణమునందు చెప్పబడిన సంబంధాలు సంఘమునందు ఒక గొప్ప స్థానాన్ని పొంది, నాటి, నేటి, రాబోవు తరాలకు కూడ ఆదర్శమైనదిగా ఉన్నదనుటలో సందేహము లేదు. కావున రామాయణములో వివరించబడిన సంబంధాలు, సంఘంలో వాటికున్న గౌరవం తదితర విషయాలు ఆమూలాగ్రముగ ఇపుడు వివరించబడినవి.

## 4.1. రాజు - రాజ్యము

అయోధ్యను పరిపాలించిన రఘువంశ ప్రభువులలో అజమహారాజు కుమారుడు దశరథుడు. ఇతనికి కౌసల్య, కైకేయి, సుమిత్ర అను ముగ్గురు భార్యలు, శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుడు అను నలుగురు కుమారులు గలరు. దశరథుడు విద్యాకోవిదుడు. ధర్మపరాయణుడు. బలవంతుడు. ఇతడు ఉత్తమ శాసకుడు, రాజనీతిజ్ఞుడు. ఇతని రాజ్యము అయోధ్య. అయోధ్య అనిన అతనికి అపారమైన ప్రేమ. అయోధ్య సరయూనది తీరమున యున్న కోసల దేశమున మనువుచే నిర్మించబడి లోక ప్రసిద్ధమైయుండెను. ఆ అయోధ్యానగరము పండ్రెండు యోజనముల పొడవు, మూడు యోజనముల వెడల్పుతో శోభాయమానమై, ఎల్లెడల పూవులచే నింపబడి, చక్కగా తీర్చిదిద్దబడిన రాజ మార్గములతో, నిత్యము నీళ్ళ చేత తడుపబడుచు నొప్పుచుండెను. దశరథుడును ధర్మపాలన చేయుచు, అభివృద్ధి చేయుచు దేవలోకమున ఇంద్రుడు వలె అయోధ్యా నగరమున నివసించుచుండెను.

దశరథునిచే పరిపాలించబడుచున్న ఆ అయోధ్య వందిమాగదుల చేతను, ధనధాన్య సమృద్ధి కల్గినదై కాంతి చేతను, ఎత్తైన రాజభవనములపై నెగురు పతాకముల చేతను, వందల కొలది శతఘ్నులు కల్గియుండెను. మరియు పూలతోటలతోను, మామిడి తోటలతోను అలరారుచుండెను. అది శత్రు ప్రవేశమునకు వీలుకాకుండ నిర్మించబడినది. దశరథుడు సామంతరాజుల తోడను, వివిధ రత్నములు పొదిగి నిర్మించిన రాజ భవనములతోను, సమస్త

రత్నములతోడను వ్యాప్తమైనటువంటి ఆ అయోధ్యను రేయింబవళ్ళు బాగా చూచుకొనుచుండెను[12]. దశరథుని కాలం నాటి అయోధ్యలో నివశించు ప్రజలకు ఎటువంటి ఈతి బాధలు లేక సిరిసంపదలతో హాయిగా జీవనము చేయుచుండిరి. నిత్యము అగ్ని కార్య మొనర్చువారును, శమదమాది గుణములు కలవారును, వేద వేదాంగ పారంగతులును, ఎల్లప్పుడు దానమొనర్చు వారును, సత్యమందాసక్తి కలవారును, గొప్ప బుద్ధి కలవారును, వశిష్టాది మహర్షులతో సమానమగు బ్రహ్మణ శ్రేష్ఠులతో కూడిన ఆ అయోధ్యా నగరమున దశరథుడు నివశించుచుండెను[13].

---

*12. ఆయతా దశ చద్వేచ యోజనాని మహాపురీ।*
*శ్రీమతీ త్రీణి విస్తీర్ణం సువిభక్త మహా పథా॥*
*రాజ మార్గేణ మహతా సువిభక్తేన శోభితా।*
*ముక్తా పుషావకీర్ణేన జలసిక్తేన నిత్యసః॥*
*తాంతు రాజా దశరథో మహారాష్ట్ర వివర్ధనః।*
*పురీ మావా సయామాస దివం దేవ పతి ర్యథాః॥*
*సూత మాగధ సంబంధాం శ్రీమతీ మతుల ప్రభామ్।*
*ఉచ్చాట్టాల ధ్వజవతీం శతఘ్నీశత సంకులామ్॥*
*వధూనాటక సంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్।*
*ఉద్యానాం మ్రవణోపేతాం మహతీం సాలమేఖలామ్॥*
*దుర్గ గంభీర పరిఘాం దుర్గా మన్యైర్దురాసదామ్।*
*వాజి వారణ సంపూర్ణాం గోభి రుష్ట్రైః ఖరై స్తథా॥*
*బా. కా. 5.7-13.*

*13. తామగ్ని మద్భిర్గుణ వద్భి రావృతాం ద్విజోత్తమైర్వేద షడంగ పార్గైః।*
*సహస్రదై స్సత్యరతైర్మహాత్మభిః ర్మహర్షికల్పైః ఋషి భిశ్చకేవలైః॥*
*అందులోనే 5.23.*

అన్ని దేశములకు అభిమతుడగు దశరథుడు తన రాజ్యమందు చెఱువులు త్రవ్వించుట, తోటలు పెంచుట, యాగముల నాచరించుట మున్నగు విషయములందు ఆసక్తుడై రాజ్యమును పరిపాలించెను. ఇట్లు ఇక్ష్వాకు వంశుడగు దశరథ మహారాజుచే అయోధ్య పరిపాలించబడెను. దశరథుని వలె శ్రీరాముడు కూడ శరణాగత రక్షణము మున్నగు వాటి యందు ఆసక్తి కల్గినవాడై దుష్టులను శిక్షించుచు, ప్రజలను రక్షించుచు రాజ్యమును చక్కగా పరిపాలించెను. శ్రీరామచంద్రుని పాలన ఆచంద్ర తారార్కము విలసిల్లు నట్టిది. అతని పాలన భూమండలమునందలి రాజుల కెల్లరకు ఆదర్శమైనది. శ్రీరాముడు తండ్రి కిచ్చిన మాట ప్రకారము పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసి, నంది గ్రామమున సోదరులలెల్లరిని కలుసుకొని, ఓడలను తీసివేసి సీతాసమేతుడై మునుపు తండ్రిచే నివ్వబడిన రాజ్యమును స్వీక రించెను. రాముడెపుడు రాజ్యమును స్వీకరించునాయని ఎదురుచూచుచున్న ప్రజలు ఆనందముతో తమ కోర్కెలు నెరవేరునన్న సంతోషముతో ఆనందము నొందిరి. రాముడు రాజ్యమును పాలించుచుండ రాముని యెడల భక్తి పూర్వక మగు ధర్మాచరణ తత్పరులై, మానసిక బాధనుగాని, శారీరకసంబంధమగు వ్యాధిని గాని, కరువుకాటకాది భయముగాని లేని వారై ప్రజలు నిశ్చింతగా యుండిరి[14].

---

*14. నంది గ్రామే జటాహిత్వా భ్రాతృభిః సహితో్య నఘః।*
*రామస్సీతామను ప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్॥*
*ప్రహృష్టో ముదితో లోక స్తుష్టః సుధార్మికః।*
*నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్ష భయ వర్జితః॥*
*బా. కా. 1.89-90.*

## 4.2 రాజు - ప్రజలు లేక సేవకుల సంబంధం

దశరథునకు అయోధ్య ప్రజలన్న చాల ప్రేమ, గౌరవము కూడ. దశరథుడు రాజు అయినప్పటికి నియంతృత్వం గలవాడు కాడు. స్వయముగా నిర్ణయములు చేసి ప్రజలపై రుద్దెడివాడు కాడు. తాను రాజైన మొదలు శ్రీరామపట్టాభిషేకం వరకు తను ఏమాత్రం సొంత నిర్ణయములు తీసుకొనక, మహర్షుల, మంత్రుల, సామంతుల, ప్రజల నిర్ణయములు గైకొనియే కార్యములు ఆరంభించుచుండెను. రాజుల కాలములో ఇట్టి ప్రజాస్వామ్యము నెలకొల్పుటలో దశరథుడు ఆదర్శప్రాయుడనుటలో సందేహం లేదు. చివరకు శ్రీరాముని పెండ్లి విషయం కూడా తాను స్వయముగా నిర్ణయము తీసుకొనక పురోహితులకు, మంత్రులకు తెలిపి వారి సమ్మతము ప్రకారమే జనకుని నగరమునకు వెళ్లి వివాహము జరిపించెను.

దశరథుని కాలము నాటి అయోధ్యలోని ప్రజలు నివాస సౌఖ్యముచే సంతోషంతోను, ధార్మికమైన మనస్సు కలవారుగను, తమ తమ ధనముచే సంతుష్టులై, దానము చేయుచు ఎల్లప్పుడు సత్యమునే పలుకుచుండిరి. స్త్రీ పురుషులందరు ధర్మ స్వభావులై ఇంద్రియములను వశీకరించుకొని, మంచి స్వభావము ఆచారము కలవారై మహర్షుల వలె నిర్మలమైన మనస్సు కలిగి యుండిరి. ఆ శ్రేష్ఠ నగరమున జనులెల్లరు చిరకాలము జీవించువారై, ధర్మము తప్పక సత్యము వీడక, పిల్లలతోను, మనుమలతోను ఎల్లప్పుడు కలసి

యుండిరి[15]. దశరథుడు రాజ్యపాలకుడుగా ఉన్నపుడు మోసగాడుగాని, పరస్త్రీ వ్యామోహము కలవాడుగాని ఎక్కడను లేకుండెను. ఇది అయోధ్య లోనే గాదు, కోసల దేశమంతట అధర్మము లేక ప్రశాంతముగనుండెను[16].

రాజు చారచక్షువు. కావున చారులను పంపి వారి వలన స్వపర రాష్ట్రముల విషయములు జూచుచు, దోషులను దండించుచు, ప్రజలను ఆనందింపజేయు చుండెను. మరియు మూడు లోకములలో తన దాన గుణము, పరాక్రమముచే ప్రసిద్ధుడై, దాన శీలుడై, సత్య ప్రతిజ్ఞ కలవాడై రాజ్యమును పరిపాలించెను. ప్రజలకు కల్గు అనిష్టములు తొలగించి ఇష్టములు కలుగజేయుచుండెను. అందువలననే దశరథుడు స్వర్గమును దేవేంద్రుడువలె ఈ భూమండలము నంతను చక్కగా పరిపాలించెను[17]. ఇచ్చట దశరథుడు రాజు. ఆయన ఏమైనను చేయవచ్చును. కాని ప్రజాహితమును కోరువాడు కావున ప్రజల

---

15. *తస్మిన్ పురవరే హృష్టా ధర్మాత్మానో బహుశ్రుతాః।*
*నరాస్తుష్టాధనైః స్వైః స్వైః అలుబ్ధాః సత్యవాదినః॥*
*సర్వేనరాశ్చ నార్యశ్చ ధర్మశీలాః సుసంయతాః।*
*ఉదితా శ్శీలవృత్తాభ్యాం మహర్షయః ఇవామలాః॥*
*దీర్ఘాయుషో నరాస్సర్వే ధర్మంసత్యం చ సంశ్రితాః।*
*సహితాః పుత్ర పౌత్రైశ్చనిత్యం స్త్రీ భిః పురోత్తమే॥*
*బా.కా. 6-6, 9, 18.*

16. *కశ్చిన్న దుష్టస్తత్రాసీత్ పరదారరతో నరః।*
*ప్రశాంతం సర్వమేనా సీత్ రాష్ట్రం పురవరం చతత్ ॥* *అందులోనే. 7.13*

17. *అవేక్షమాణ శ్చారేణ ప్రజా ధర్మేణ రంజయన్।*
*ప్రజానాం పాలనం కుర్వన్నధర్మం పరివర్జయన్॥*
*విశ్రుత స్త్రీ షు లోకేషు వదాన్యః సత్య సంగరః।*
*సతత్ర పురుష వ్యాఘ్రః శశాస పృథివీమిమామ్॥* *అందులోనే. 7.19-20*

అభిప్రాయము ప్రకారమే వారి మాటను తీసుకొనియే రాజ్యమును పరిపాలించెను. ఇది దశరథుని ఉత్తమ ప్రజాస్వామ్యమునకు అద్దం పడుతున్నది.

శ్రీరాముని పరిపాలనయందు కూడ ప్రజలెవ్వరు అకారణముగ తమకన్న ముందుగ పుత్ర మరణ బాధను పొందనైరి. స్త్రీ లెవ్వరు వైధవ్యము లేక దీర్ఘకాలము పతి సేవాపరాయణులై కాలము గడుపుచుండిరి. ఎవరూ అగ్నిలో పడిగాని, నీటిలో మునిగి గాని, ఆత్మహత్య చేసుకొనలేదు. పెను గాలుల వలన భయము లేదు. ఆకలివలన బాధగాని, దొంగల వలన భయము గాని లేదు. ప్రజలకు కష్టములు కలిగినపుడు శ్రీరాముడు తనకు వచ్చినట్లు గానే భావించి దుఃఖించెడివాడు. ప్రజలకు శుభములు కలిగినపుడు వారి అభివృద్ధిని చూచి తండ్రివలెనే మిక్కిలి సంతోషించుచుండెను[18]. శ్రీరాముడు అరణ్యావాసంలో ఉన్నప్పుడు భరతుడు రాముని తీసుకొని వచ్చుటకు బయలు దేరెను. అపుడు ప్రజలందరు భరతుని వెంబడించుటను బట్టి రాజు ప్రజలకు గల సంబంధం మనకు ఎలాంటిదో విదితమగుచున్నది. కృతయుగమున జనులెట్లు సంతోషము నొందియుండిరో అట్లే త్రేతాయుగమునందు కూడ ప్రజలు సుఖ శాంతులతో సంతోషముగా యుండిరి. కావున రామాయణమున రాజు- ప్రజలు అన్యోన్యంగా, ఆదరాభిమానములతో జీవించుచుండిరి. నాటికి నేటికి వ్యత్యాసం ప్రత్యక్షంగా మనము చూస్తున్నాము. నేడు పరిపాలకులకు ప్రజలకు చాలా దూరమున్నది. పాలకులు పరిపాలనను ఒక

---

18. వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః।
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి॥ అయో.కా. 2.40

వ్యాపారంగా చూచుచున్నారే గాని ప్రజల బాగోగులు చూడడంలేదు. ఒక వేళ చూచినా అది నామమాత్రమే. ఈ దేశంలో పరిపాలకులు నూటికి తొంభై మంది ఆర్థికంగా సాంఘికముగా లాభము పొందారేగాని నష్టపోయినవారు చాలా అరుదు. ప్రతి కార్యక్రమం ప్రజా సంక్షేమమని చెపుతూ తమ ఆస్తులు పెంచుకొంటున్నారు. కావున ఆనాటి రామరాజ్యం, రాముని పరిపాలనకు ఈనాటి ప్రజాహిత పాలనకు వ్యత్యాసం పాఠకులే నిర్ణయించుకోవాలి. ఎవరో ఏదో అన్నాడని తన భార్యను త్యజించిన రామరాజ్యం అది. కోర్టులు అభిశంసించిన, ప్రజలు ఎదిరించి అవహేళన చేసినా, పత్రికలు వ్రాసినా మానాభిమానములు లెక్కచేయక పరిపాలిస్తున్న రోజులివి.

## 4.3. రాజు - భక్తులు

రాముడికి ప్రియమిత్రుడు గుహుడు. అరణ్యవాస సందర్భమున శ్రీరాముడు సీతా లక్ష్మణులతో కలసి శృంగి బేరం వెలుపల విడిది చేసెను. అది గాంచి గుహుడు వివిధ పలహారములతో వారిని సత్కరించుటకు సంసిద్ధుడాయెను. నిషాదులకు రాజు అయినప్పటికి గుహుడు తన అనుచరుడైనందున రామునితో ఎంతో స్నేహ పూర్వకముగ మాట్లాడి, అతనిపై తనకు గల అనురాగమును తెలుపుకొనెను. శ్రీరాముడును గుహునితో ఓ మిత్రమా! నీవు కాలినడకతో వచ్చి మమ్ములను ఆహ్వానించి మాకు అన్ని విధముల సహాయము చేసితివి. నీచే మేము పూజింపబడితిమి. సంతుష్టులమైతిమి అని పలికి గుహుని కౌగలించుకొని తన స్నేహ భావమును ప్రకటించుకొనెను. గుహుడు కూడ రామునికి తగిన అన్ని సపర్యలు చేసి

అతనిపై తనకు గల భక్తి భావమును తెలుపుకొనెను. ఇచ్చట గుహుడు రామునికి ప్రియమిత్రుడైనను, యతనిని గురువుగా భావించి అతనిపై తనకు గల భక్తిని చాటుకొనెను[19].

రామలక్ష్మణులు అరణ్యవాస సందర్భమున పంపా సరస్సు దగ్గర కల శబరి ఆశ్రమమును చూచి, అతి సుందరమగు ఆ ఆశ్రమమును చూచుటకు శబరి యొద్దకేగిరి. శబరి మాతంగ మహర్షి శిష్యురాలు. ఆమె ధర్మము తప్పనిది. తపస్విని, గురుసేవా తత్పరురాలు. రామచంద్రుని దర్శనము లభించగానే రామునితో రామా! నా తపము సఫలమైనది. నీ గురువులిపుడు చక్కగా పూజితులైనారు. నీ దర్శన భాగ్యము చేతనే నాకు పరమపదము సిద్ధించెను. నేనిక పుణ్యలేకములకు వెళ్ళగలను అని పలికెను[20].

తర్వాత శబరి రామునకు నమస్కరించి దర్భాసనముపై అతనిని కూర్చుండబెట్టి, పాదములు కడిగి పాపవినాసనమైన ఆ జలమును తనపై

---

19. *తతోగుణవ దన్నాద్యము పాదాయ పృథగ్విధమ్।*
*అర్ఘ్యం చోపానయత్‌క్షిప్రం వాక్యం చేదము వాచ హ॥*
*గుహమేవం బ్రువాణంతు రాఘవః ప్రత్యువాచహహ*
*అర్చితాశ్చైవ హృష్టాశ్చ భవతా సర్వథా వయమ్॥*
*పద్భ్యా మభిగమాచ్చైవ స్నేహ సందర్శనేన చ। అయో.కా.50.37, 40-41.*

20. *అద్యప్రాప్తా తపస్సిద్ధిస్తవ సందర్శనాన్మయా।*
*అద్యమే సఫలం తప్తం గురవశ్చ సుపూజితా॥*
*అద్యమే సఫలం జన్మస్వర్గశ్చైవ భవిష్యతి।*
*త్వయి దేవవరేరామ! పూజితే పురుషర్షభః॥*
*చక్షషా తవ సామ్యేన పూతాస్మి రఘు వందనః।*
*గమిష్యామ్యక్షయా ల్లోకాం స్త్వత్ప్రసాదా దరిందమః॥ అర.కా.74.11-13*

చల్లుకొనెను. పిదప అచటనే బాగా పండిన పండ్లను, తియ్యని దుంపలను ఎంపిక చేసి, మాధుర్య పరీక్షకై తొలుత వానిని రుచి చూచి తరువాత వాటిని రామలక్ష్మణులకు ఇచ్చెను. రాముడు శబరి ఇచ్చిన పండలను తిని ఆమెకు ఉత్కృష్టమైన ముక్తి నొసంగెను[21]. తర్వాత ఆ శబరి రామునననుజ్ఞపొంది యాక్షణముననే జీర్ణమైన తన దేహమును విడిచి, దివ్యదేహముతో స్వర్గమున కేగెను[22]. శబరి ఇట్లు రామునిపై గల తన భక్తిని తెలియజేసుకొనెను.

రామాయణమునందు హనుమంతునికి రామునిపై అపారమైన భక్తి భావము కలదు. సామాన్యముగ సేవకులు యజమాని సుఖములందును, ఐస్వర్యములందు తేలియాడుచున్నపుడే ఆశ్రయించియుందురు. అవి యజమానికి దూరమైనచో నిర్ధాక్షిణ్యముగ అతనిని విడిచి వేయుదురు. సుగ్రీవుడు వాలిచే బహిష్కృతుడైనపుడు సుగ్రీవుని మంచితనమును దృష్టి

---

21. *ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశవిష్టరే।*
*పాద ప్రక్షాళనం కృత్వాతత్తోయం పాపనాశనం॥*
*శిరసాధార్య పీత్వాచ వన్యైః పుష్పైః రథార్చయత్।*
*ఫలాని చ సుపక్వాని మూలాని మధురాణి చ॥*
*స్వయ మాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ।*
*పశ్చాన్ని వేదయామాస రాఘవాభ్యాం దృఢవ్రతాః॥*
*ఫలాన్యాస్వాద్య కాకుత్‌స్థస్తస్యై ముక్తిం పారాంథదౌ।* అర.కా.పు.566

22. *ఇత్యుక్త్వా జటిలా వృద్ధా చీర కృష్ణాజినాంబరా।*
*తస్మిన్ముహూర్తే శబరీ దేహం జీర్ణం జిహాసతీ॥*
*అను జ్ఞాతాతురామేణ హుత్వాఽఽత్మానం హుతాశనే।*
*జ్వలత్పావక సంకాశా స్వర్గమేవ జగామసా॥* అందులోనే. 74.32-33

యందుంచుకొని అతనినే అనుసరించిన వ్యక్తి హనుమంతుడు. ఋష్యమూక పర్వతమున వాలి వలన భయకంపితుడైన సుగ్రీవుని చూచి హనుమంతుడు దేవా! మీరిక ఏ మాత్రము వాలి వలన భయపడకుము. ఈ పర్వతమందు వాలి వలన భయము లేదు[23]. అని చెప్పి ఆపదలో ఉన్న అతనికి ధైర్యము కలిగించిన ధీశాలి హనుమంతుడు.

సీతాన్వేషణ సందర్భమున హనుమంతుడు అసోక వనమున సీతను చూచి ఆమెతో సంభాషించి, ఆమెకు ధైర్యము కలిగించి, రాముడు వచ్చి నిన్ను త్వరలో తీసుకొని పోవునని తెల్పెను. తర్వాత రావణుని బలపరాక్రమములను స్వయముగా తెలుసుకోవలెనన్న కోరికతో అచట వున్న రాక్షసులతో తగవు పెట్టుకొని, ఇంద్రజిత్తుచే రావణుని వద్దకు తీసుకొని పోబడెను. అచట రావణునితో రాముని గొప్పతనమును గూర్చి తెలుపుచు చివరికి రావణునికి ఇట్లు హితమును ఉపదేశించెను. రాక్షసేశ్వరా! నేను హనుమంతుడను వాడను. వాయుపుత్రుడను. నేను సీతాన్వేషణార్థమై నూరు యోజనముల పొడవైన సముద్రమును దాటి, ఇచటికి వచ్చి, ఈ లంకలో సీతాదేవిని చూసితిని[24]. నీవు శాస్త్రోక్తముగ ధర్మస్వరూపమును తెలుసుకొన్నవాడవు. మహా

---

*23. సంభ్రమస్త్వ జ్యతామేష సర్వై ర్వాలికృతేమహాన్।*
*మలయ్యోయం గిరవరో భయం నేహాస్తి వాలినః॥ కి.కా. 2.14*

*24. అహంతు హనుమాన్నాను మారుత స్యౌరస స్సుతః।*
*సీతాయాస్తు కృతేతూర్ణం శతయోజన మాయతమ్॥*
*సముద్రం లంఘయిత్వైవ తాం దిదృక్షురిహ్యాగతః।*
*భ్రమతా చ మయా దృష్టా గృహీతే జనకాత్మజా॥ సుం. కా. 51.15-16*

తపస్సంపన్నుడవు. అన్యుల భార్యను నీవిట్లు నిరోధించుట తగదు. దేవాసురులలో నెవ్వడు రామునితో పోరాడువారు లేరు. రామునికి అప్రియ మొనర్చి సుఖమును పొందువాడు ముల్లోకములందు లేరు[25].

కావున నీవు నామాట విని సీతను ఆ రామునకప్పగించుము. మరియు నేననుకొన్నచో ఈ లంకా పట్టమము సులువుగా నాశనము చేయగలను. కాని రామునాజ్ఞ లేదు. రామునికి అపకారం చేసి సాక్షాత్తు దేవేంద్రుడే సుఖము పొందలేడు. మరి నీకొకలెక్క[26]! నీ మిత్రులను, మంత్రులను, బంధువులను, సోదరులను, కుమారులను, హితులను, భార్యలను సీత కారణముగా పోగొట్టుకొనకుము[27]. నీకు విశేషించి రామ దూతగా ఇచటికి వచ్చినాను. రాజశ్రేష్ఠుడైన, ప్రభువైన రామునకు అపకారమొనర్చి నీవు జీవించుట కష్టము అని రావణునకు పలుపలు విధముల హనుమంతుడు హితబోధచేసెను. ఇచట హనుమంతుని బుద్ధి కౌశలము ప్రసంశనీయ మైనదే కాక, అతనికి రామునిపై గల భక్తి భావము ప్రకటితమగుచున్నది.

---

*25. కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపానువర్తినాం।*
*శరాణామగ్రతఃస్థాతుం శక్తోదేవాసురేష్వపి॥*
*న చాపి త్రిషు లోకేషు రాజన్విద్యేత కశ్చన।*
*రాఘవస్య వ్యళీకం యః కృత్వా సుఖ మవాప్నుయాత్॥ సుం. కా. 51.19-20*

*26. అపకుర్వన్హి రామస్య సాక్షాదపి పురందరః।*
*న సుఖం ప్రాప్నుయాదన్యః కింపునస్త్వద్విధో జనః॥ అందులోనే. 51.33*

*27. స్వానిమిత్రాణి మంత్రీంశ్చ జ్ఞాతీన్ భ్రాతౄన్ సుతాన్ హితాన్।*
*భోగాన్ దారాంశ్చ లంకాం చ మావినాశ ముపానయ॥ అందులోనే. 51.37*

మరియు హనుమంతుడు వానరులకెల్ల మేటి వీరుడు. గరుత్మంతుని రెక్కల బలము ఎట్టిదో హనుమంతుని భుజ బలము కూడ అట్టిది. వేగములోను, పరాక్రమములోను హనుమంతుడు గరుత్మంతునికి ఏమాత్రము తీసిపోడు. తన భుజబలము చేత లంకలోని ప్రాసాదములు తగులబడుచుండ ఇంద్రుడు వజ్రాయుధంతో రాక్షసులను చంపినట్లు అనేక మంది రాక్షసులను హతమార్చెను[28]. ఈ విధముగ హనుమంతుడు రామునిపై తనకు గల భక్తిని వ్యక్తపరచుకొనెను. తర్వాత సీత క్షేమమును రామునికి తెలియజేయుట, అంగదునితో యుద్ధము, రామరావణుల యుద్ధము, రావణుని సంహారం జరిగిన తర్వాత రామచంద్రుని పట్టాభిషేకము వరకు గల అనేక కార్యములందు హనుమంతుడు రామునిపై తనకున్న భక్తిభావమును నిరూపించుకొనెను. దీనిని బట్టి నాటి కాలమున రాజులకు – వారిపై భక్తులకు గల సంబంధము ప్రకటితమగుచున్నది.

## 4.4 తండ్రి – కుమారుల సంబంధం

దశరథుని కుమారులు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. చాలా రోజుల తర్వాత కల్గిన కుమారులు కావున దశరథుడు వారిని అల్లారుముద్దుగా పెంచుకొనుచుండెను. విశ్వామిత్రుడు యాగరక్షణార్థము రాముని తనతో పంపమని దశరథుని కోరగా, ఆ మాటలు విని దశరథుడు క్షణకాలము మూర్ఛిల్లి, తర్వాత తేరుకొని ఇట్లు చెప్పెను. స్వామీ! ఈ రాముడు పదునా

---

*28. దహ్యమానం తతోదృష్ట్వా ప్రాసాదం హరియూథపః।*
*సరాక్షస శతం హత్వా వజ్రేణేంద్ర ఇవాసురాన్॥ సుం.కా.43.19*





రేండ్ల ప్రాయముకూడ లేనివాడు. అతనికి రాక్షసులతో యుద్ధము చేయునట్టి శక్తి కలదని నాకు అనిపించడం లేదు[29]. నేను నా సైన్యముతో వచ్చి నీ యాగమును సంరక్షించెదను. యుద్ధ రంగమున ముందు నిలచి నా ప్రాణము లున్నంత వరకు ఆ రాక్షసులతో పోరాడెదను[30]. కావున నీవు రాముని తీసుకొని పోరాదు. అతడు బాలుడు. విలువిద్యలు నేర్వనివాడు. శత్రువుల బలాబలములను ఎరుగడు. అస్త్ర బలము గాని, యుద్ధ కుశలత గాని అతనికి లేదు. అతనిని వదలి ఒక క్షణమైనను నేను జీవించలేను. కావున మీరు రాముని తీసుకొని పోవలదు[31]. ఒక వేళ నీవు రాముని తీసుకొని పోవలెనన్న నేను కూడ చతురంగ బలముతో అచటికి వచ్చెదను. నన్ను కూడ తీసుకొని పొమ్మయని విశ్వామిత్రునితో పరిపరివిధముల చెప్పుట వలన రామునిపై దశరథునికి గల పుత్రవాత్సల్యము మనకు విధితమగుచున్నది.

ఆ మాటలు విన్న విశ్వామిత్రుడు ఇట్లు చెప్పెను. దశరథా! పౌలస్త్య వంశమున పుట్టిన రావణుడు బ్రహ్మచే వరమీయపడినవాడై, గొప్పపరాక్రమ

---

*29. ఊనషోడశవర్షోమేరామో రాజీవలోచనః।*
*నయుద్ధయోగ్యతామస్య పశ్యామి సహరాక్షసైః॥ బా.కా. 20.2*

*30. అహమేవ ధనుష్పాణి ర్గోప్తా సమరమూర్ధని।*
*యావత్ప్రాణాన్ ధరిష్యామి తావద్యోత్స్యే నిశాచరైః॥ అందులోనే. 20.5*

*31. బాలోహ్యకృత విద్యశ్చ న చ వేత్తి బలాబలమ్।*
*న చాస్త్ర బలసంయుక్తో న చ యుద్ధ విశారదః॥*
*న చ సౌ రక్షసాం యోగ్యః కూటయూద్ధా హితే ధ్రువమ్।*
*విప్ర యుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే॥*
*జీవితుం మునిశార్దూల నరామం నేతు మర్హసి। అందులోనే. 20.7-9*

సంపన్నుడై, అనేకమంది రాక్షసులతో కూడినవాడై ముల్లోకములను బాధపెట్టుచున్నాడు. అతడు గొప్ప పరాక్రమశాలి. ఎవరైనను యజ్ఞము చేయప్రారంభించినచో, అతనిచే ప్రేరితులైన మారీచ సుబాహులను రాక్షసు వచ్చి యజ్ఞమునకు విఘ్నమొనరింతురు[32].

ఆ మాటలు విన్న దశరథుడు స్వామీ! నేను రావణుని ఎదిరిం. సమర్థుడను కానా! నీవు నాకుమారుని వదిలిపెట్టి నన్ను ఆ కార్యమునకు అనుగ్రహింపుము. నేను నా సైన్యంతో కూడ వెళ్ళి వారితో యుద్ధము చేయతలపడెదనని విశ్వామిత్రునితో చెప్పెను. మరియు ఓ బ్రాహ్మణోత్తమా! రాముడు దేవతలతో సమానము. యుద్ధమందు ప్రావీణ్యము లేనివాడు. చిన్న బాలుడు. కావున బాలుడైన అతనిని ఎట్టి పరిస్థితులలోను ఇవ్వను అని చెప్పెను[33]. దీనిని బట్టి తండ్రియైన దశరథునకు కుమారుడైన రామునకు గల సంబంధం లేక అతనికి రామునిపై గల ప్రేమ ఎట్టిదో స్పష్టముగా

---

32. *పౌలస్త్య వంశ ప్రభవో రావణోనామ రాక్షసః।*
*సబ్రహ్మణా దత్తవర స్త్రైలోక్యం బాధతే భృశమ్॥*
*మహాబలో మహావీర్యా రాక్షసైర్బహుభిర్వృవః।*
*శ్రూయతేహి మహావీర్యో రావణో రాక్షసాధిపః॥*
*సాక్షాద్వైశ్రవణ భ్రాతా పుత్రో విశ్రవసోమునేః।*
*యదా స్వయంన యజ్ఞస్య విఘ్నకర్తా మహాబలః॥*
*తేన సంచోదితౌ ద్వౌతు రాక్షసౌ సుమహాబలౌ।*
*మారీచశ్చ సుబాహుశ్చ యజ్ఞ విఘ్నం కరిష్యతః॥ బా.కా. 20.16–19*

33. *కథమప్యమర ప్రఖ్యం సంగ్రామాణా మకోవిదమ్।*
*బాలం మే తనయం బ్రహ్మన్నైవ దాస్యామి పుత్రకమ్॥ అందులోనే. 20.24*

విదితమగుచున్నది. మరియు భరత శత్రుఘ్నులు కూడా యుధాజిత్తు కోరికపై కేకయ దేశమునకు వెళ్ళిరి. వారిని కూడ దశరథుడు నిరంతరము తలచుకొను చుండెను. పురుష శ్రేష్టులగు నలుగురు కుమారులు అతనికి నాలుగు చేతులవంటివారు [34].

ఈ విధముగా దశరథుడు తన నలుగురు కుమారులపై ఎంతో వాత్సల్యం చూపుచుండెను. ఐనను పెద్ద కుమారుడైన, ఉత్తమ గుణములు కల్గిన రామునిపై ఎక్కువ ప్రేమ కల్గియుండెను. లోకమున ఎవడైనను ఇట్టి ప్రేమను ప్రదర్శించుట సహజమే. ఇట్టి పుత్ర వాత్సల్యము లోకమున గల తల్లిదండ్రుల కందరికి మార్గదర్శకమనియు, మరియు తండ్రి – కుమారుల సంబంధం, ఒకరిపై ఇంకొకరికి గల ప్రేమానురాగాలు ఎట్లుండును అను విషయము రామాయణము వలన మనకు స్పష్టముగా తెలియుచున్నది.

రామాయణమునందు రామునికి తండ్రియనిన అపారమైన ప్రేమ. అతని పితృభక్తి ప్రశంసనీయమైనది. అనితరసాధ్యమైనది. సహజముగ ఈ లోకమందు తండ్రి ఆర్థికముగా సహాయ పడునంత వరకు కుమారులు బాగా ప్రేమను ప్రదర్శించెదరు. ఆర్థికముగా వెనుకబడినచో, తండ్రికి సముచిత గౌరవము ఇవ్వక, తమకు ఏ మాత్రము వారి వలన నష్టము వాటిల్లినదని తలంచినచో తండ్రులను అనేక విధముల హింసించడం కూడ మనము ఈ

---

*34. సర్వ ఏవతు తస్యేష్టాశ్చత్వారః పురుషర్షభాః।*
*స్వశరీరా ద్వినిర్వృత్తాశ్చత్వార ఇవ బాహవః॥ అయో.కా.1-5*

రోజులలో చూస్తున్నాము. కాని రాముడు తనకు న్యాయపరంగా రావలసిన రాజ్యము ఇవ్వనప్పటికి తండ్రి ఇచ్చిన వరముల కారణముగ, క్షణకాలంలో తప్పిపోయిన రాజ్యప్రాప్తి విషయమున కూడ ఏ మాత్రము చలించక అరణ్యములకు బయలుదేరినట్టి ధీరోదాత్తుడు. రాముని దృష్టిలో తండ్రి దైవముతో సమానము. దేవతలకు సైతము తండ్రియే దైవము. కావున దశరథుని దైవమని భావించియే అతని వాక్యమును పాటించుటకు సంసిద్ధుడయ్యెను[35].

తాటకవధ సందర్భమున కూడ నేను ''కౌశికవాక్యము'' పాలింపుమని నా తండ్రిచే ఆజ్ఞాపింపబడితిని. తండ్రి వచనమాలకించినట్టి రాముడు తాటక వధ ఉత్తమమగు కర్తవ్యము అని తలంచి, తాటకను స్త్రీయని కూడ దయ చూపక ఆమెను వధించెను[36]. రామపట్టాభిషేక సందర్భమున కైకేయి దశరథుని రెండు వరములు కోరడం, దానికి దశరథుడు దుఃఖించడం మనకు తెలిసినదే. అట్టి సందర్భమున రాముడు తల్లి దగ్గరకు వచ్చి తల్లీ! మా నాన్న గారి దుఃఖమునకు కారణము ఏమి? ఎవరైనను ఏదైన అంటిరా! లేదా నా వలన ఏదైనా అపకారము జరిగినదా. నా తండ్రి దుఃఖమునకు కారణము తెల్పుము. నేను తండ్రి మాటను పాటించుటకు అగ్నిలో దుమకమన్నను దుమికెదను. ఘోరమైన విషమును తినమన్నను తినెదను. గురువు, తండ్రి,

---

*35. పితా హి దైవతం తాత! దేవతానామపి స్మృతమ్।*
*తస్మాద్దైవత మిత్యేవ కరిష్యామి పితుర్వచః॥ అయో. కా. 34.52*

*36. స్యోహం పితుర్వచః శ్రుత్వాశాసనాత్ బ్రహ్మవాదినః।*
*కరిష్యామి న సందేహః తాటకా వధ ముత్తమమ్॥ బా. కా. 26.4*

రాజు అన్నియూ నాకు తండ్రియే. ఆయనకు ఏమి చేయడం ఇష్టమో దానిని నేను ఆచరింతును. ఆయన ఆజ్ఞ ఏమియో తెలుపుము అని అనేక విధముల తన తల్లిని అడిగెను[37]. ఈ మాటలను బట్టి రాముని యొక్క పితృభక్తి లేక అతనికి తన తండ్రిపై గల గౌరవ భావం మనకు స్పష్టముగా తెలియుచున్నది.

అపుడు కైకేయి రామునితో నీవు 14 సంవత్సరములు అరణ్యవాసము చేయవలెను. భరతునికి రాజ్యాభిషేకము చేయవలెనుఅని నేను మీ తండ్రిని కోరితిని. కావున వెంటనే నీవు అడవులకు వెళ్లవలయును. అంతవరకు మీ తండ్రి స్నానపానాదులు చేయడు అని చెప్పెను. అంత రాముడు ఏమాత్రము బాధపడక కైకేయితో తల్లీ! పూజ్యుడగు నా తండ్రికి ప్రాణములనర్పించి యైనను నేను చేయకలిగినంత ప్రియమును చేయుదును. ఈ విషయంలో సందేహము లేదు. పితృ శుశ్రూష, పిత్రాజ్ఞాపాలనము కంటే నాకు వేరొక మహత్తర ధర్మము లేదు[38] అని చెప్పెను. మీరు తప్పక భరతుని

---

37. *అహో దిఙ్నార్హసేదేవి వక్తు మీ దృశం వచః।*
*అహం హివచనా ద్రాజ్ఞః పతేయమపి పావకే॥*
*భక్షయేయం విషం తీక్ష్ణం పతేయమపి చార్ణవే।*
*నియుక్తో గురుణా పిత్రా నృపేణాచ హితేనచ॥*
*తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభి కాంక్షితమ్।*
*కరిష్యే ప్రతిజానేచ రామోద్విర్నాభి భాషతే॥ అయో. కా.18.28-30*

38. *య దత్ర భవతః కించిచ్ఛక్యం కర్తుం ప్రియం మయా।*
*ప్రాణానపి పరిత్యజ్య సర్వధా కృతమేవ తత్॥*
*నహ్యతో ధర్మచరణం కించి దస్తి మహత్తరం।*
*యథా పితరి శుశ్రూషా తస్య వా వచన క్రియా॥ అందులోనే. 19.21-22*

రాజ్యాభిషిక్తునిగా చేయుము. నేను లేని లోపము కలుగకుండ నా తండ్రికి అతడు శుశ్రూషగావించుమని అతనితో చెప్పుము. అట్లు చేయుట సంతానధర్మము[39]. దీనిని బట్టి రాముని నిర్మలమగు పితృభక్తి ఎటువంటిదో మనకు విదితమగుచున్నది. మరియు ఆనాటి తండ్రి- కుమారుల సంబంధం ఎట్లుండినదో మనకు తెలియుచున్నది. నాటి సంబంధం ఆ విధంగా ఉండినది. నేటి తండ్రి- తనయుల సంబంధం ఎట్లున్నదో అందరికి విదితమేయని నేను భావించుచున్నాను.

## 4.5. అన్నదమ్ముల సంబంధం

సకల గుణములకు నిలయమైన రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల అనుబంధం, సోదర ప్రేమ, లోకమునకు మిక్కిలి ఆదర్శప్రాయమైనది. నేటి సమాజమున అన్నదమ్ముల మధ్య పరస్పర ప్రేమ కనిపించడం లేదు. ఫలితముగ ఒకరిపై ఒకరికి ద్వేషము, ఒకరి ఆస్తిని ఇంకొకరు అపహరించడం మొదలగు దుష్కృత్యములను అనుసరించుచున్నారు.

రామాయణము నందు కౌసల్యకు రాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ, శత్రుఘ్నులు జన్మించారు. అనగా తండ్రి ఒక్కరే ఐనను తల్లులు వేరని మనకు తెలియుచున్నది. కాని ఆ నలుగురి అన్నదమ్ముల మధ్య ఉండెడి సోదర ప్రేమ, స్నేహం, దైనందిన జీవితంలో ఆచరించుటకు ఎవరికి సాధ్యము గానిది. కాని రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులు అది సాధ్యమేయని

---

*39. భరతః పాలయేద్రాజ్యం శుశ్రూషేచ్చపితుర్యథా।*
*తథా భవత్యాకర్తవ్యం సహి ధర్మః సనాతనః॥ అయో. కా.19.26*

నిరూపించినారు. రాముని భ్రాతృప్రేమ ఎట్టిదో బాలకాండమునందు మనకు స్పష్టముగా తెలియుచున్నది. నిరంతరము తనతో ఉండు లక్ష్మణుడు లేనిచో రాముడు నిద్రించెడి వాడు కాదు. మృష్టాన్నములు లభించినను లక్ష్మణుడు లేనిచో భుజించెడి వాడు కాదు. అట్లే భరత శత్రుఘ్నులను గూడ రాముడు ఆవిధంగా భావించుచుండెను. దశరథుడు తనకు పట్టాభిషేకము చేయుదునని తెలియజేయగా రాముడు ఆ ప్రియమగు వార్తను భార్యతోను, తల్లితోను, లక్ష్మణునితోను చెప్పినాడు. ఆ సమయమున రాముడు లక్ష్మణునితో చెప్పిన మాటలను చూచినట్లైతే అతని భాతృప్రేమ మనకు స్పష్టముగా తెలియగలదు. ఓ లక్ష్మణా నాతో కూడా నీవును ఈ భూమండలమును పరిపాలించుము. నారెండవ అంతరాత్మవంటి నీకు ఇపుడు ఐశ్వర్యము పట్టినది. లక్ష్మణా నీవు ఇష్టములగు భోగములను రాజ్యఫలములను స్వేచ్ఛగా అనుభవించుము. నేను జీవితమున రాజ్యమును నీ కొరకే కోరుచున్నాను[40].

మరియు రామలక్ష్మణులు అరణ్యమునకు వెళ్ళగా, అయోధ్యకు వచ్చిన భరతుడు, జరిగిన విషయములను తెలుసుకొని, తల్లిని అనేక విధముల నిందించి, చివరగా రాజ్యమును రామచంద్రునికి అప్పగించుటకై సర్వ సైన్యమును వెంట బెట్టుకొని చిత్రకూట పర్వతంపై ఉన్న రాముని చెంతకు

---

40. *లక్ష్మణేమాం మయాసార్థం ప్రశాధిత్వం వసుంధరామ్।*
*ద్వితీయం మే అంతరాత్మనం త్వామియం శ్రీరుపస్థితా॥*
*సౌమిత్రే భుంక్ష్వ భోగాంస్త్వ మిష్టాన్ రాజ్యఫలాని చ।*
*జీవితం చాపి రాజ్యం చ తదర్థమభి కామయే॥ అయో. కా.4.43-44*

వచ్చుచుండగా, అతనిపై కోపించిన లక్ష్మణుడు అతనిని చంపుటకు రాముని ఆజ్ఞ కోరగా, ఆ సమయమున రాముడు లక్ష్మణుని అనునయించి తనకు గల అపారమైన సోదర ప్రేమను చాటుకొనెను. మరియు లక్ష్మణునితో లక్ష్మణా! భరతుని నీవిట్లు భావింపవలదు. ధర్మార్థకామములు, ఈ భూమండలము వీటన్నింటిని నేను మీ కొరకే కోరుచున్నాను. నీవు, భరత శత్రుఘ్నులు లేనట్టి ఏ అల్పసుఖమైనను నాకు వలదు[41]. భరతుడు నాకు నా ప్రాణము కంటె మిక్కిలి ఇష్టమైనవాడు. అరణ్యమునకు వచ్చిన మనలను చూచుటకు వచ్చుచున్నాడే గాని వేరొక దృష్టితో కాదు. కులధర్మము ననుసరించి భరతుడు తిరిగి రాజ్యమును అప్పగించుటకే ఇచటికి వచ్చు చున్నారు అని చెప్పెను.

యుద్ధకాండమున ఇంద్రజిత్తు యొక్క నాగపాశములచే రామలక్ష్మణులు మూర్ఛపోయిరి. మూర్ఛనుండి తేరుకొనిన రాముడు లక్ష్మణుని చూచి నాకింక సీతతోగాని, నా ప్రాణములతోగాని పని ఏమున్నది. ఈ లోక మంతయు వెతకి సీత వంటి భార్యను పొందవచ్చునేమోగాని లక్ష్మణుని వంటి తమ్ముని సంపాదించలేను[42]. దీనిని బట్టి రాముని భ్రాతృ ప్రేమ ఎట్టిదో మనకు విశదమగుచున్నది.

---

41. *ధర్మమర్థం చ కామంచ పృథివీం చాపి లక్ష్మణ।*
*ఇచ్ఛామి భవతా మర్థే ఏతత్ప్రతి శృణోమితే॥*
*యద్వినా భరతం త్వాంచ శత్రుఘ్నం చాపి మానద।*
*భవేన్మమ సుఖం కించి ద్భస్మతత్కురుతాం శిఖీ॥* అయో.కా.97.5-8

42. *శక్యాసీతా సమానారీ మర్త్యలోకే విచిన్వతా।*
*న లక్ష్మణ సమోభ్రాతా సచివః సాంపరాయికః॥* యుద్ధ. కా. 49.6

లక్ష్మణునికి రామునిడనిన అపారమైన భక్తి ప్రేమ కలదు. వనవాసమునకు వెళ్ళు సందర్భమున లక్ష్మణుడు కౌసల్యతో అమ్మా! నేను ధనస్సును ధరించి రాముని ప్రక్కన యమునివలె నిలిచినట్లైతే ఎవరు మమ్ములను ఎదిరించలేరు. నేను నా అన్నకోసం తండ్రిని కూడ బంధించెదను. తండ్రినే కాదు ఎవరినైనను దండించెదను[43]. రాముడు ప్రజ్వలించుచున్న అగ్నిని గాని, అరణ్యమును గాని ప్రవేశించినచో అతని కన్నాముందుగనే నేను అందు ప్రవేశింతును[44]. నేను నిజముగా మనఃపూర్వకముగ నా అన్న రామునియందు అనురక్తుడనే. నా సత్యముతో, ధనస్సుతో, దానముతో, దేవతార్చనతో నీకు ప్రమాణం చేసి చెప్పుచున్నాను[45]. అని పలికి రాముని యెడల అతనికి గల ఉత్తమ సోదర భావమును ప్రకటించెను.

అపుడు రాముడు లక్ష్మణా! ఈ వనవాసమునకు కారణము దైవమే కాని వేరొకటి కాదు. కైకేయి పలికిన తీవ్ర మాటలకు దైవమే కారణంగాని వేరొకరు కాదు. సుఖ దుఃఖములు, శాంతి క్రోధములు, లాభనష్టములు, ఉత్పత్తి వికాసములు అను యిట్టి ఊహింపరాని కారణము కలదెల్లయు

---

*43. గురో రప్య వలిప్తస్య కార్యాకార్య మజానతః।*
*ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనం॥ అయో. కా. 21.13*

*44. దీప్త మగ్ని మరణ్యం వా యది రామ ప్రవేక్ష్యతి।*
*ప్రవిష్టం తత్ర మాందేవి! త్వం పూర్వ మవధారయ॥ అందులోనే 21.17*

*45. అనురక్తోఽస్మిభావేన భ్రాతరం దేవి తత్త్వతః।*
*సత్యేన ధనుషా చైవ దత్తేనేష్టేన తేశపే॥ అందులోనే. 21.16*

దైవకార్యమే గాని వేరొకటి కాదు[46]. అపుడు లక్ష్మణుడు రామునితో అసమర్థమగు దైవమునకు నీవు సమర్థముగ పలుకుచున్నావు. నీ వంటివాడు ఇట్లు మాట్లాడుట తగదు. దుర్బలురు మాత్రమే దైవమును విశ్వసించెదరు. శోచనీయము, శక్తి లేనిది అగు దైవమును ఏల పొగెడెదవు[47]. పిరికివాడు, శక్తిలేనివాడు దైవమును అనుసరించును. వీరులు ధీరులగు వారు మాత్రము దైవమును అనుసరించరు[48]. ఏదైవముచే ఈ పట్టాభిషేకము ఆటంక పరచబడినదో ఆ దైవమునే పౌరుషముతో నాశనము చేసెదను[49]. దేవతలు కూడ నీ పట్టాభిషేకమును చెడగొట్టలేరు. అట్టి ఎడ మన తండ్రి ఎట్లు చెడగొట్ట గలరు[50]. నీకెవరు అరణ్యావాసము విధించారో వారినే అరణ్యావాసము చేయునట్లు చేసెదను[51]. ఈ విషయమున ఇంద్రునినైనను ఎదిరించెదను. దీనిని బట్టి లక్ష్మణునికి అన్నయైన రామునిపై గల ప్రేమ లేక ఆ అన్నదమ్ముల

---

46. సుఖదుఃఖేభయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ।
యచ్చకించిత్తథా భూతం నను దైవస్య కర్మతత్॥ అయో. కా. 22.22

47. కిం నామ కృపణం దైవ మశక్త మభిశంససి।
పాపయోస్తే కథంనామ తయోశ్శంకా న విద్యతే॥ అందులోనే 23.7

48. విక్లబో వీర్యహీనో యస్సదైవ మనువర్తతే।
వీరా స్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే॥ అందులోనే. 23.16

49. అద్యమత్పౌరుషం హతం దైవం ద్రక్ష్యంతివై జనాః।
యుద్దైవా దాహతంత్వేఽద్య దృష్టం రాజ్యాభిషేచనమ్॥ అందులోనే 23.19

50. లోకపాల స్సమస్తాస్తే నాద్య రామాభిషేచనమ్।
నచ కృత్స్నాస్త్రయో లోకా విహన్యుఃకింపునః పితా॥ అందులోనే. 23.21

51. అహం తదాశాం ఛేత్స్యామి పితుస్తస్యాశ్చ యాతవ।
అభిషేక విఘాతేన పుత్ర రాజ్యాయ వర్తతే॥ అందులోనే. 23.23

అనుబంధం మనకు విదితమగుచున్నది. మరియు అడవికి బయలు దేరు సందర్భమున లక్ష్మణుడు రామా! నేనును విల్లు ధరించి నిన్నే అనుసరింతును అని రామునితో లక్ష్మణుడు అడవులకు బయలు దేరుటను బట్టి అతని భ్రాతృ ప్రేమ మనకు స్పష్టముగా తెలియుచున్నది.

అరణ్యావాసమున తన అన్నను రక్షింపవలెనని తలంచి సీతరాములు నిద్రించినను లక్ష్మణుడు నిదురింపక యుండెను. ఆ విధముగా మేల్కొన్న లక్ష్మణుని చూచి గుహుడు లక్ష్మణా! మేమందరము కష్టములకు అలవాటు పడినవారము. నీవు సుఖములకు అలవాటు పడినవాడవు. కావున ఈ రోజు రాముని రక్షణకై మేము మేల్కొందుము అని అనెను[52]. అపుడు లక్ష్మణుడు పాపరహితుడగు ఓ గుహుడా! ధర్మదృష్టి గల నీవు రక్షించుచుండగ నాకు భయమేల? రాముడు సీతతో గూడి నిదురించుచుండగ నాకెట్లు నిద్ర వచ్చును? ఆ శ్వాసనము ఎట్లు ఏర్పడును. కావున నేనే వీరిని రక్షించవలసి యున్నదని, రాముని ఎడల తనకు గల కర్తవ్యతను బాధ్యతను తెలియజేసెను.

రామాయణమునందు భరతుడు కూడ దశరథుని మరణ వార్తను తల్లి ద్వారా విని చాలా దుఃఖించెను. తర్వాత తండ్రితో సమానుడగు రాముడు లక్ష్మణునితో కలసి అరణ్యములకు వెళ్లినాడన్న విషయమును తెలుసుకొని పరిపరి విధముల దుఃఖించెను. అపుడు కైకేయి భరతునితో కుమారా! ఈ కార్యమంతయు నేను నీ కొరకే చేసితిని. నీ విపుడు రాజువై భూమినంతయు

---

52. ఉచితోఽయం జనస్సర్వః క్లేశానాం త్వం సుఖోచితః।
గుప్త్యర్థం జాగరిష్యామః కాకుత్స్థస్య వయం నిశామ్॥ అయో. కా.51.3

పరిపాలించుము[53]. నీ తండ్రిని గూర్చి దుఃఖింపకుము. ప్రస్తుతము నీవు ఈ రాజ్యమునకు పట్టాభిషక్తుడవుకమ్మ్మయని పల్కెను. అపుడు భరతుడు తన తల్లిని నిందించి, తండ్రితో సమానుడగు రాముడు లేని రాజ్యము నాకెందుకు అని పరితపించెను. దీనిని బట్టి భరతునకు రామునిపై గల సోదర ప్రేమ ప్రకటిత మగుచున్నది.

రాజ్యాభిషేకమునకు నియమించిన వారెల్లరు భరతుని దగ్గరకు వచ్చి రాజా! మీరిపుడు రాజ్యమును చేపట్టవలయునని కోరగా, భరతుడు అభిషేకమునకు తెచ్చిన వస్తువుల నన్నింటికి ప్రదక్షిణము చేసి వారితో ఇట్లు చెప్పెను. మా రాజ్యమందు జ్యేష్ఠుడే రాజు కావడం మీకు తెలుసు. కావున నన్ను రాజు కామనడం మీకు ఉచితం కాదు. ఏనాటికైనను రాముడే రాజు కాగలడు. అతనికి బదులుగా నేను పదునాల్గు సంవత్సరములు అరణ్యావాసము చేసెదను. చతురంగ బలముతో కూడి రాముని అడవి నుండి ఇచటికి తీసుకొని వత్తును[54]. అభిషేకమునకు తీసుకొని వచ్చిన ఈ ఉపకరములన్నింటిని రామాభిషేకమునకై నేను వీటిని అడవికి తీసుకొని వెళ్లెదను. అడవిలోనే

---

53. *త్వయాత్విదానీం ధర్మజ్ఞ రాజత్వ మవలంబ్యతామ్।*
*త్వత్కృతే హిమయాసర్వమిద మేవం మయాకృతమ్॥ అయో.కా. 72.52*

54. *జ్యేష్ఠస్య రాజతానిత్య ముచితా హి కులస్యనః।*
*నైవం భవంతో మాం వక్తు మ్హర్హంతి కుశలాజనాః॥*
*రామః పూర్వోహినో భ్రాతా భవిష్యతి మహీపతిః।*
*అహం త్వరణ్యే వత్స్యామి వర్షాణి నవపంచ చ॥*
*యుజ్యతాం మహతీసేనా చతురంగ మహాబలా।*
*ఆనయిష్యామ్యహం జ్యేష్ఠం భ్రాతరం రాఘవమ్ వనాత్॥ అందులోనే.79.7-9*

అతనికి పట్టాభిషేకము చేసి అయోధ్యకు తీసుకొని వచ్చెదనుయని చెప్పెను[55] ఈ మాటలను బట్టి ఆ అన్నదమ్ముల మధ్య ఉన్న సంబంధం ఎట్టిదో మనకు తెలియుచున్నది.

తర్వాత భరతుడు చిత్రకూట పర్వతమున వున్న రాముని ఆశ్రమమును గాంచి రాముడు నా కారణముగ ఈ అరణ్యమందు కష్టములను అనుభవించు చున్నాడు. నా జన్మ నిరర్ధకమైనదని అనేక విధముల దుఃఖించెను[56]. తర్వాత రాముని పాదములపై పడి అయోధ్యకు వచ్చి రాజ్యమును స్వీకరించమని అనేక విధముల ప్రార్థించెను. పితృవాక్యపాలన నిమిత్తమై అయోధ్యకు తిరిగి వచ్చుటకు రాముడు సమ్మతించలేదు. తర్వాత రాముని పాదుకలను తీసుకొని, అతనితో ఇట్లు పలికెను. నేను ఈ పాదుకలపైననే రాగ తంత్రములు నిలిపి అయోధ్యకు వెలుపలయే 14 సంవత్సరములు పూర్తియైన వెంటనే నిన్ను చూడనిచో నేను అగ్ని ప్రవేశమొనర్తును[57], యని కఠోర ప్రతిజ్ఞను చేపట్టి లోకోత్తరమగు తమ్మునిగా భరతుడు తనకు గల సోదర ప్రేమ తెలియజేసు

---

*55. అభిషేచనికంచైవ సర్వమేత దుపస్కృతమ్।*
*పురస్కృత్య గమిష్యామి రామహేతో ర్వనంప్రతి॥*
*తత్రైవ తం నర వ్యాఘ్ర మభిషచ్య పురస్కృతమ్।*
*ఆ నేష్యామి తువై రామం హవ్య వాహమివాధ్వరాత్॥ అయో. కా. 79.10-11*

*56. జనేంద్రో నిర్జనం ప్రాప్యధిఙ్మే జన్మ సజీవితమ్॥ అందులోనే. 99.15*

*57. సపాదుకే సంప్రణమ్యరామం వచన మబ్రవీత్।*
*చతుర్దశ హివర్షాణి జటాచీరధరోహ్యాహమ్॥*
*ఫలమూలాశనోవీర! భవేయం రఘునందన।*
*తవాగమన మా కాంక్షన్ వసన్వై నగరా ద్బహిః॥*
*తవ పాదుకయోర్న్యస్త రాజ్యతంత్రః పరంతప।*
*చతుర్దశేహి సంపూర్ణే వర్షేహని రఘూత్తమ॥*
*నద్రక్ష్యామి యదిత్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్॥ అందులోనే. 112.23-25*

కొనెను. దీనిని బట్టి భరతునకు సోదర ప్రేమ ఎట్టిదో లేక రామ భరతుల సంబంధం ఎట్టిదని మనకు తెలియుచున్నది.

రామాయణమున శత్రుఘ్నుడు కూడ మంచి సోదర భావములు కలవాడు. రామ, లక్ష్మణ, భరతులనిన అతనికి అపారమైన ప్రేమ, గౌరవం. దశరథుని మరణవార్త, రాముడు అడవులకు వెళ్లిన వార్త విన్న శత్రుఘ్నుడు వీటన్నింటికి కారణం అందరం అని తెలుసుకొనెను. అపుడు ద్వార పాలకులు ఆమెను పట్టి శత్రుఘ్ననికి అప్పగించి ఆమెకు తగిన దండన విధింపుమని కోరిరి[58]. అంత శత్రుఘ్నుడు ఆమెను కోపంతో భూమిపై పడవేసి ఈడ్చెను. తర్వాత భరతుని ఆజ్ఞమేరకు ఆమెను చంపకుండ వదలి వేసెను[59]. దీనిని బట్టి శత్రుఘ్ననకు తన అన్నయైన భరతునిపై గల ప్రేమ ఎట్టిదో తెలియు చున్నది.

ఈవిధముగా రామాయణమునందు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల అన్నదమ్ముల అనుబంధం, సోదర ప్రేమ ఒకరిపై ఒకరికి గల భక్తి తదితర విషయములు ఎట్లుండినవని మనకు తెలియుచున్నది. కాని నేడు దానికి విరుద్ధమై అన్నదమ్ముల మద్య సఖ్యత లేక చివరికి హింసించుట, చంపుకొనుట

---

58. *యస్యాఃకృతే వనే రామో న్యస్త దేహశ్చవఃపితా।*
*సేయం పాపా నృశం సాచ తస్యాః కురు యథామతి॥ అయో. కా. 78.9*

59. *తాంప్రేక్ష్య భరతః క్రుద్ధం శత్రుఘ్నమిద మబ్రవీత్‌హ*
*అవధ్యాస్సర్వ భూతానాం ప్రమదాః క్షమ్యతామితి॥ అందులోనే. 78.21*

మున్నగునవి కూడ జరుగుచున్నవి. నాటి అన్నదమ్ములు ఒకరికొకరు ప్రాణములర్పించుటకు కూడ సిద్ధపడిన సందర్భములనేకము కలవు. దీనిని బట్టి నాటి అన్నదమ్ముల సంబంధం, నేటి అన్నదమ్ముల సంబంధంలో ఎంత వ్యత్యాసమున్నదో మనకు తెలియుచున్నది.

మరియు జనకుని తండ్రి హ్రస్వరోముడు, తమ్ముడు కుశధ్వజుడు, జనకునకు తన తమ్ముడనిన చాలా ఇష్టం. సుధన్వుడను రాజు సీతనివ్వమని జనకుని కోరగా, జనకుడందులకు నిరాకరించడం ఆ కారణంగా జనక సుధన్వులకు యుద్ధం జరిగింది. ఆ యుద్ధమున సుధన్వుడు మరణించగా జనకుడు తన తమ్ముడైన కుసధ్వజుని ఆ దేశమునకు రాజుగా ప్రకటించెను. సీతారాముల వివాహ సందర్భమున విశ్వామిత్ర వశిష్టుల కోరిక మేరకు తన తమ్ముని కుమార్తెలైన మాండవీ, శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నులకిచ్చి వివాహం అత్యంత వైభవముగా జరిపించెను. దీనిని బట్టి జనకునకు తన తమ్ముడైన కుశధ్వజునిపై కల ప్రేమ మనకు తెలియుచున్నది.

కావున రామాయణంలో చెప్పబడిన అన్నదమ్ముల సంబంధం నాటి నుండి నేటి వరకు మానవ లోకానికే అర్థం పడుతున్నది. మరియు అటువంటి సంబంధం నేటికి మనకు ఆదర్శవంతమైనది. కాని నేడు ఎచటను అటువంటి అనుబంధం కన్పించుట లేదు. ఒకరినొకరు ద్వేషించడం, ఈర్ష్యా భావములు పెంచుకోవడమే గాక, చంపుకొనుటకు కూడ సంసిద్ధులగుచున్నారు. దీనిని

బట్టి నాటి అన్నదమ్ముల సంబంధం, నేటి అన్నదమ్ముల సంబంధమునకు ఏ విధంగా పోలికలు లేవని, లేక సరిపోవడం లేదని చెప్పవచ్చును.

## 4.6. సవతుల సంబంధం

రామాయణమునందు దశరథునికి భార్యలు ముగ్గురు. కౌసల్య, కైకేయి, సుమిత్ర. వీరు ముగ్గురు ఒకరినొకరు తోబుట్టువులుగా భావించారే గాని సవతులుగా అనుకోలేదు. కౌసల్య దశరథునికి మొదటి భార్య. పట్టపురాణి. ఒకానొక సందర్భమున దశరథుడే కైకేయితో కౌసల్యను గూర్చి ఇట్లు చెప్పెను. కౌసల్య తాను పట్టమహిషి ఐనను సేవచేయు సమయమున దాసివలెను, ద్యూతక్రీడాది విషయమున స్నేహితురాలువలె, ఇతర భార్యలను పెండ్లి చేసుకొనునపుడు తోబుట్టువు వలె, శరీర పోషణ సమయమున తల్లివలె, ప్రవర్తించుచుండెను[60]. భార్యకు ఉండవలసిన లక్షణములు ఏవో అట్టి లక్షణములను కల్గినట్టి ఉత్తమ ఇల్లాలు కౌసల్య[61].

---

*60. యదా యదాహి కౌసల్యా దాసీ వచ్చ సఖీవచ।*
*భార్యావద్భగినీవచ్చ మాతృవచ్చోప తిష్ఠతి॥ అయో. కా.12.68*

*61. కార్యేషు దాసీ కరణేషు మంత్రీ*
*భోజ్యేషు మాతా శయనేషు రంభా।*
*రూపే చ లక్ష్మీ క్షమయా ధరిత్రీ*
*షట్కర్మయుక్తా కులధర్మపత్నీ॥*
*నారాయణ రెడ్డి. సి. ఆధునికాంధ్ర కవిత్వము.*
*సికిందరాబాద్. 1967. పు. 334.*

దశరథుడు కైకేయిని పెండ్లి చేసుకొన్న తర్వాత కౌసల్యను దూరముగా ఉంచెను. స్త్రీకి మొదటి దిక్కు భర్త. పుత్రుడు రెండవ దిక్కు. దాయాదులు మూడవ దిక్కు. ఈ ముప్పురు తప్ప వేరెచటను స్త్రీకి స్వాతంత్ర్యము లేదు[62]. ఇదే విషయమును మనువు కూడ ఇట్లు ధ్రువీకరించెను. స్త్రీని బాల్యమునందు తండ్రి, యౌవ్వనము నందు భర్త, వృద్ధాప్యమునందు పుత్రుడు సంరక్షించును[63]. అటు భర్త మరణమునకు, ఇటు పుత్రుడైన రాముడు అడవికి వెళ్ళుటకు కారణమైన కైకేయిని నిందించక కౌసల్య ఆమెను తోబుట్టువు వలె చూచుటను బట్టి, కౌసల్యకు సవతి ప్రేమ ఎటువంటిదని మనకు స్పష్టముగా తెలియుచున్నది. నారీ లోకముకే ఆ సవతుల సంబంధం మార్గదర్శకమగుచున్నది.

సుమిత్ర కూడ మంచి సద్గుణవంతురాలు. మరియు శీల సంపన్నురాలు. కౌసల్య, కైకేయి కన్నను మిక్కిలి ఆధ్యాత్మికపరురాలు. ఉత్తమ ఇల్లాలు కూడ రామ లక్ష్మణులు అడవికి వెళ్లు సందర్భమున కూడ లక్ష్మణునితో సుమిత్ర కుమారా! నీవు సదా రాముని అనుసరించుము[64]. అతని రక్షకుడవై

---

*62. గతిరేకా పతిర్నార్యా ద్వితీయా గతిరాత్మజః।*
*తృతీయా జ్ఞాతయో రాజం శ్చతుర్థీనేహ విద్యతే॥ అయో. కా.61.24*

*63. పితారక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవ్వనే।*
*రక్షంతి స్థావిరేపుత్రా నస్త్రీ స్వాతంత్ర్య మ్మర్హతి॥*
*మనుస్మృతి. గోపాల శాస్త్రినేని.*
*చౌఖాంబా సంస్కృత సంస్థాన్, వారణాసి. 1982.9.3*

*64. వ్యసనీవా సమృద్ధోవా గతిరేష తవానఘ।*
*ఏషలోకే సతాం ధర్మో యజ్జ్యే ష్ఠవశగో భవేత్॥ అయో. కా.40.6*

అతనినే సేవించుము. దీనిని బట్టి రాముడు సవతి కుమారుడైనను అతని యందు ఆమెకు గల ప్రేమ మనకు తెలియుచున్నది.

మరియు సీతారామలక్ష్మణులు అడవికి వెళ్ళు సందర్భమున కౌసల్య మిక్కిలి విలపించెను. ఆ సమయమున సుమిత్ర కౌసల్యతో సద్గుణవతీ! నీ కుమారుడు పురుషోత్తముడు. మంచి గుణములు కలవాడు. లక్ష్మణుడు రాముని విషయమున అనురక్తుడై ఎల్లప్పుడు రాముని కాపాడును. రాత్రు లందు నిద్రపోవుచున్న నీ కుమారునికి చంద్రుడెట్లు చల్లని కిరణములతో స్పర్శించుచు ఆహ్లాదమును కలిగించునో అట్లు లక్ష్మణుడు ఆహ్లాదమును కలిగించును. రాముడు మరల తప్పక రాజ్యమును పొందగలడు[65]. కావున నీవిక దుఃఖింపవలదు అని చెప్పెను. దీనిని బట్టి సుమిత్ర యొక్క సవతి ప్రేమ, పుత్రవాత్సల్యం ఎట్టిదో మనకు తెలియుచున్నది.

కేకయ దేశ రాజకుమార్తెయైన కైకేయి దశరథునకు మూడవ భార్య. పట్టమహిషి. ఆయనకు అత్యంత ప్రియమైనది కూడ. కైకేయి భరతుడు తన కుమారుడైనను రామలక్ష్మణ శత్రుఘ్నులను కూడ తన పుత్రులవలె చూచుకొనుచుండెను. రామచంద్రుని పట్టాభిషేక వార్త విన్న కైకేయి మిక్కిలి సంతోషించెను. దీనికంటె ప్రీతిమయమైనది నాకేమున్నదియని మందరతో చెప్పుటను బట్టి రాముడు సవతి కొడుకైనను అతని యందు అత్యంత ప్రేమ

---

65. *యాశ్రీశ్శౌర్యం చ రామస్యయాచ కళ్యాణ సత్త్వతా।*
*నివృత్తారణ్యవాస స్సక్షిప్రం రాజ్యమవాప్స్యతి॥ అయో. కా. 44.14*

కలదని మనకు తెలియుచున్నది. ఈ మాటలు కైకేయిని ఉన్నత శిఖరములకు తీసుకొని పోయినవి. లోకమున సామాన్యముగ సవతిని, సవతి పిల్లలను ఈ విధంగా చూచుట చాలా అరుదు. అట్టి సుగుణసంపన్నురాలు కైకేయి. చివరకు మందర కారణంగా తాను రాముని అడవులకు పంపించెను. ఐనను కౌసల్య సుమిత్రలను ఎట్టి సందర్భములోను నిందించడం గాని, అవమానించడంగాని రామాయణమున కానరాదు.

దీనిని బట్టి రామాయణ కాలమునందు సవతుల సంబంధం ఎట్టిదో మనకు విదితమగుచున్నది. కాని ఈనాడు రెండవ పెళ్లి చేసుకోవడమే చాలా అరుదు. ఒక వేళ అట్లు జరిగినచో ఇక ఆ సవతుల అనుబంధం వివరింవనలవి కాదు. ఇదియే నాటికి, నేటికి గల తారతమ్యమని మనకు రామాయణ మహాకావ్యం ద్వారా తెలుస్తున్నది.

## 4.7. అత్తా-కోడళ్ళ సంబంధం

రామాయణమునందు అత్తాకోడళ్ళ సంబంధం చాలా ప్రశంసనీయ మైనది. మానవలోకమునకు అది ఆదర్శవంతమైనది. దశరథునకు కుమారులు నలుగురు. శ్రీరామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులు. జనకునకు కుమార్తెలు ఇద్దరు. సీత మరియు ఊర్మిళ. జనకుని తమ్ముడైన కుశధ్వజుని కుమార్తెలు ఇద్దరు. మాండవి, శ్రుతకీర్తి. శ్రీరాముడు సీతను, లక్ష్మణుడు ఊర్మిళను, భరతుడు మాండవిని, శత్రుఘ్నుడు శ్రుతకీర్తిని వివాహమాడిరి. వివాహమై అయోధ్యకు తిరిగి వచ్చినది మొదలు వారి అత్తగారైన కౌసల్య,

కైకేయి, సుమిత్రలు ముగ్గురు కోడళ్ళను తమ సొంత కుమార్తెలుగా భావించిరి. ఏనాడు కోడళ్ళను వేరే దృష్టితో చూడలేదు. కోడళ్ళు కూడ అత్తగారిని తమ సొంత తల్లులుగా భావించిరి. వేరు విధముగా వారిని చూడలేదు. ఇందు అత్తాకోడళ్ళ మధ్య ఎప్పుడు ఏ విధమైన మనస్పర్థలు గాని, మాట-మాటలు గాని జరిగినట్లు ఎక్కడ దాఖలాలు లేవు.

రామాయణంలోని బాలకాండలో కోడళ్ళు అయోధ్యకు రాగానే కౌసల్య, కైకేయి, సుమిత్ర వారిని అంతఃపురములోనికి తీసుకొని పోయి అనేక విధములైన ఉపచారములు చేసిరి. తర్వాత వారు భాగ్యవతియగు సీతకు, కీర్తిమతియగు ఊర్మిళకు మరియు మాండవీ, శ్రుతకీర్తులకు మంగళా శాసనములు పలికిరి. తర్వాత కోడళ్ళు పట్టు వస్త్రములు ధరించి గృహ దేవతలను పూజించిరి. అయోధ్యలో గల పెద్దల కెల్లరకును నమస్కరించి వారి అభిమానములు గైకొనిరి[66].

తర్వాత సీతారామ లక్ష్మణులు వనవాసమునకు వెళ్లు సందర్భమున సీత అత్తమామలను ఏ మాత్రము నిందించక వారిపై గల గౌరవంతో అత్తగారైన కౌసల్య పాదములు తాకి, ప్రణమిల్లి కన్నులనిండ నీరు నింపుకొని దుఃఖితయై

---

66. కౌసల్యాచ సుమిత్రాచ కైకేయీచ సుమధ్యమా।
మధూప్రతిగ్రహే యుక్తా యాశ్చాన్యా రాజ యోషితాః॥
తతస్సీతాం మహాభాగా మూర్మిళాంచ యశస్వినీమ్।
కుశధ్వచసుతే చోభే జగృహుర్న్పప పత్న్యయ॥
మంగళాలాపనైశ్చైవ శోభితాః క్షౌమవాససః।
దేవతా యతనా న్యాశు సర్వాస్తాః ప్రతపూజయన్॥ బా.కా.77.10-12

వారి ముందు నిలచెను. ఆ విధముగా దుఃఖించుచున్న కుమార్తెతో సమానమైన సీతను కౌగలించుకొని కౌసల్య ఇట్లు పలికెను. విదేహరాజు కుమార్తె, దశరథుని కోడలు, రాముని భార్య ఐన నీకు ఇట్టి కష్టము కల్గినది. అమ్మా సీతా! ఎండకు వాడిన తామర పూవువలె, వాడిపోయిన కలువవలె, దుమ్ముచే కప్పబడి కాంతి తరిగిన బంగారమువలె, మేఘములచే కప్పబడిన చంద్రుని వలె నున్న నీ ముఖము చూచిన నామనస్సును ఆపదయను ఆరణి నుండి పుట్టిన శోకము, అగ్ని కట్టెలను దహించునట్లు దహించుచున్నది[67]. ఇట్లు సీతకు కల్గిన కష్టమును తలచుకొని అనేక విధముల దుఃఖించెను.

ఉత్తరరామ చరిత నాటకమునందు వాల్మీకి ఆశ్రమంలో కౌసల్య కోడలైన సీతను తలచుకొని అనేక విధముల దుఃఖించెను. మరియు ఓ జానకీ! ఇపుడు నేనేమి చేయగలను. ఏ విధంగా కఠోరమైన వజ్రము దాని పూత యొక్క బంధమునకు నిశ్చయమో అట్లే దురదృష్టవంతురాలైన నేనును ఈ పాడు

67. *సీతాపి చరణాం స్తాసా ముపసంగృహ్య దుఃకితా।*
*స్వశ్రూణా మశ్రుపూర్ణాక్షీ సాబభు వాగ్రతః స్థితా॥*
*తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా।*
*వనవాస కృశాం దీనాం కౌసల్యా వాక్య మబ్రవీత్॥*
*విదేహ రాజస్య సుతాస్నుషా దశరథస్యచ।*
*రామపత్నీ కథం దుఃఖం సంప్రాప్తా విజనే వనే॥*
*పద్మ, మాతప సంతప్తం పరిక్లిష్టమి వోత్పలమ్।*
*కాంచనం రజసా ధ్వస్తం క్లిష్టం చంద్ర మి వాంబుదైః॥*
*ముఖం తే ప్రేక్ష్యమాం శోకో దహ త్యగ్ని రివాఽ శ్రయమ్।*
*భృశం మనసివైదేహి! వ్యసనారణి సంభవః॥ అయో. కా.103.22-26*

జీవితం విడువవలెను[68]. ఇట్లుకౌసల్య కోడలైన సీతను తన కుమార్తె కంటె మిన్నగా చూచుకొనుచుండెను.

దీనిని బట్టి వాల్మీకి రామాయణము నందు అత్తాకోడళ్ళు తల్లీకూతుళ్ళ వలె అన్యోన్య అనురాగములతో ప్రవర్తించినట్లు మనకు తెలియుచున్నది. నాటి అత్తాకోడళ్ళ అనురాగం, సంబంధం అలాంటిది. నేటి అత్తాకోడళ్ళ సంబంధం ఎట్లున్నది మానవ లోకమునకు తెలిసినదే.

## 4.8. భార్యా భర్తల సంబంధం

శ్రీమద్రామాయణమున భార్యాభర్తల అనుబంధం చాలా ప్రశంసనీయమైనది. ఎచటను ఒకరినొకరు నిందించుకోవడంగాని, ఎదిరించి మాట్లాడుకోవడంగాని లేదు. మరియు ఒకరిమాట ఇంకొకరు కాదనక ప్రేమానురాగాలతో కూడిన దాంపత్య జీవితమే రామాయణమున వివరించబడినది. యుగవిభజన ప్రకారం చూచినను త్రేతాయుగం నాటి దాంపత్య జీవితానికి తర్వాత వచ్చిన ద్వాపరాది యుగాల నాటి దాంపత్య జీవితాలకు చాలా వ్యత్యాసం కన్పిస్తున్నది. ముఖ్యంగా రామాయణమునందు దశరథ రామాదుల దాంపత్యజీవితం ఎట్లుండినదో ఇందు సవిస్తరముగా వివరించబడినది.

---

*68. ఉత్తర రామచరితమ్. భవభూతి. వారణాసి. 1990. పు.334*

## 4.8.1. దశరథుడు - కౌసల్య, కైకేయి, సుమిత్ర

ఇక్ష్వాకు వంశమునకు చెందిన ఇందుమతి అజమహారాజుల ఏకైక పుత్రుడు దశరథుడు. దశరథునకు కౌసల్య, కైకేయి, సుమిత్రయను ముగ్గురు భార్యలుండిరి. ఐనను ఆ భార్యాభర్తల అన్యోన్య దాంపత్య జీవితం చాలా ప్రశంసనీయమైనది. ఇతడు వేద వేత్త. ధర్మపరుడు. త్రిలోక విఖ్యాతుడు. కౌసల్య దశరథునకు మొదటి భార్య. కౌసల్య తాను పట్టమహిషి అయినను దశరథునకు సేవ చేయుచున్న సమయమున దాసివలె, క్రీడాదివిషయమున స్నేహితురాలివలె, ధర్మానుష్ఠాన విషయమున భార్యవలె, కైకేయి, సుమిత్రలను పెండ్లి చేసుకొనునపుడు తోబుట్టిన దానివలె, శరీర పోషణ మున్నగు సమయములలో తల్లి వలె ప్రవర్తించుచుండెను[69]. మరియు కౌసల్య పతిభక్తి పరాయణురాలు. కావుననే దశరథుడు మరణించు సందర్భమున తనకీ దుస్థితి కల్గుటకు కారణమైన శ్రవణ కుమారుని కథను కౌసల్యకు వివరించెను. అవసాన సమయమున దశరథుడు తన దగ్గరకు వచ్చెనని ఆమె ఏ మాత్రము బాధపడక అతనిని ఎంతో ప్రేమతో చూచుకొనెను. కావున వారి దాంపత్య జీవితం నిజంగా మానవ లోకానికి ఆదర్శమని చెప్పవచ్చును.

దశరథుని రెండవ భార్య సుమిత్ర. ఈమె అందరిని మించిన బుద్ధి సంపన్నురాలు. కైకేయి కౌసల్యకన్నను మిక్కిలి ఆధ్యాత్మిక పరురాలు.

---

*69. అయో. కా.12.68*

రాబోవు విషయములను ముందుగా ఊహించకల్గినట్టి శక్తి కల్గినది. దశరథ సుమిత్రలు కూడ చాలా అన్యోన్యంగా ఉండిరి. ఈమె జ్ఞాన సంపన్నురాలు. ఈమె పతి సేవాతత్పరురాలు. ఈమె నిత్యము కౌసల్యా దేవినే అనుసరించు చుండెను. కైకేయి దేశాధిపతియైన అశ్వపతి కుమార్తె. యుధాజిత్తు చెల్లెలు. ఈమె చాలా అందగత్తె. ఎంత అందమైనదో అంత తెలివి తేటలు గలది. యుద్ధ కళయందు కూడ ఈమెకు మిక్కిలి ప్రావీణ్యత కలదు.

అందువలననే శంబరునితో దశరథుడు యుద్ధము చేయుటకు పోయినపుడు రాక్షసులచే క్షత, విక్షత గాత్రుడైన అతనిని కాపాడి అతనికి విజయము చేకూర్చినది[70]. అందుకే దశరథుడు కైకేయి పైనలే ఎక్కువ మక్కువ చూపించెడి వాడు. పట్టాభిషేక సమయమున దశరథుని రెండు వరములు కోరడం, దశరథుడు బాధ పడడం జరిగింది. అట్టిసమయమున కూడ దశరథుడు కైకేయిని శ్రీరాముడు నీకేమి అపకారం చేసెనని నిందించెను గాని, పరుష భాషణ చేయలేదు. ఇచ్చట దశరథుడు తన భార్యకిచ్చిన మాటను నిలుపుకొనుటచే వారి దాంపత్య జీవితం ఎటువంటిదో మనకు తెలియుచున్నది. దీనిని బట్టి రామాయణయున దశరథుని దాంపత్య జీవితం లేక దాంపత్య సంబంధం అత్యంత ప్రేమతో, ఆదరాభిమానములతో, సత్ప్రవర్తనతో కూడు కొన్నటువంటిదని మనకు విదితమగుచున్నది.

---

*70. అపవాహ్యత్వయాదేవి సంగ్రామా న్నష్టచేతనః।*
*తత్రాపి విక్షత శ్శస్త్రైః పతిస్తే రక్షిత స్త్వయా ॥ అయో. కా. 9.16*

## 4.8.2. సీతారాములు

రామాయణమున వర్ణించబడిన సీతారాముల దాంపత్య జీవితం మానవలోకానికే మార్గదర్శకమైనది. మనకు షోడశ సంస్కారములలో వివాహము మిక్కిలి ప్రధానమైనది. ఏలయన వేద చోదితమగు కర్మకాండ మంతయును గృహ స్థాశ్రమాధీనమైయున్నది. సాంసారిక జీవనము, వంశోన్నతి, ఋణత్రయ విముక్తి మొదలగునవన్నియును గృహస్థాశ్ర మాధీనములు. గృహస్థాశ్రమము సాధనాబహుళమైనది. ఈ ఆశ్రమ పాలన ద్వారా ఐహిక పారమార్థికములగు ద్వివిధాభ్యుదయములు సాధింపబడు చున్నవి. వేదములు, మానవుడు మూడు ఋణములతో పుట్టునని చెప్పు చున్నవి. అవి 1. ఋషి ఋణము, 2. దేవ ఋణము, 3. పితృ ఋణము. వీనిలో ఋషి ఋణము అధ్యయనము వలన తీరును. దేవ ఋణము యజ్ఞములు చేయుట వలన తీరును. పితృఋణము సంతానోత్పాదనము వలన తీరును. ఈ మూడు ఋణములు తీర్చని వానికి ముక్తి లభించదని శాస్త్రములు చెప్పుచున్నవి.

వ్యాసుడు గృహస్థాశ్రమ ప్రాధాన్యతను గూర్చి దేవతలు, పితరులు, అతిథులు, భృత్యులు మున్నగు వారందరూ గృహస్థు నాశ్రయించియే బ్రతుకుతున్నారనెను[71]. గృహస్థుడు స్వధర్మ నిర్వహణము ద్వారా బ్రహ్మ లోకమును పొందును. ఇది అన్ని ఆశ్రమములలోను ఉత్తమమైనదని పెద్దలు చెప్పుచున్నారు.

---

*71. గృహస్థం హి సదా దేవాః పితరోతిథయాస్తథా।*
*భృత్యాశ్చై వోప జీవంతి తాన్ భరస్వ మహీపతే॥*
*మహాభారతం, దండేకర్. ఆర్.ఎన్. భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, పూనె 1974.24.4*

‘‘వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే’’– అని ఆర్యవచనము. వియ్యము గాని కయ్యముగాని సమానులతోడనే జరుపవలెనని పై ఆర్యోక్తి యొక్క భావము. ఆది కవియగు వాల్మీకి భార్య భర్తలలో యుండు పవిత్ర ప్రణయము యొక్క ఔదాత్త్యమును, స్నిగ్ధత్వమును, ప్రగాఢత్వమును, సీతా రాములు, అత్రి అనసూయలు మొదలుగా గల పవిత్ర దంపతుల ఆదర్శ గార్హస్థ్యము ద్వారా నిరూపించియున్నాడు. సీతారాముల ప్రణయంలోని ప్రగాఢత్వమును గూర్చి వాల్మీకి మహర్షి, సీత తనకు, తన తండ్రిచే అంగీకరించబడి వివాహము చేసిన భార్య అగుట వలనను, చందానువర్తన రూప గుణము కల్గినదగుట చేతను, సౌందర్యాతిశయము చేతను ఆమెయందు రామునకు ప్రేమ దిన దిన ప్రవర్ధమానము కాజొచ్చెను అని చెప్పెను. సీత హృదయమందు కూడ భర్తయగు రాముడు, ద్విగుణమగునట్లుగా వసించుచుండెను. ఆమె హృదయాంతర్గతమైన ఈ నిగూఢ ప్రేమను, ఆమె యొక్క హృదయము అతని హృదయముతో స్పష్టముగా చెప్పుచున్నది[72].

ఈ దాంపత్య ప్రణయము దంపతులలోని ద్వైతభావమును తొలగించి అద్వైత భావమును కలిగించును. సుఖ దుఃఖములలోను, ఉత్థాన పతనములలోను, సర్వకాల సర్వావస్థలయందును వారొకరిపై నొకరు సదా సంలగ్న

72. *ప్రియాతు సీతారామస్య దారాః పితృకృతా ఇది।*
*గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతి ర్భూయోభి వర్ధతే॥*
*తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే।*
*అన్తర్గతమపి వ్యక్తమాఖ్యాతి హృదయం హృదా॥ బా.కా. 77.27–28.*

మనస్కులై యుండునట్లు చేయును[73]. ప్రణయసూత్రమున ఆబద్ధులైన దంపతులు నిత్యము పరస్పర సాహచర్యమును వాంచింతురు. దానికొరకు ఈ లోకమునకే కాదు పరలోకమును కూడ తృణీకరింతురు. ఇంతకంటె దీని మహత్త్వమును వేరుగనెట్లు చెప్పనగును.

కావుననే రాముడు 14 సంవత్సరములు తండ్రి ఆజ్ఞచే అరణ్యావాసము చేయదలచి అరణ్యమునకు వెళ్లుటకు సిద్ధపడగా సీత నేనును నిన్ను అనుసరింతుననీ, పతిని విడిచిన భార్య జీవింపజాలదని చెప్పి అతనిని అనుసరించుటకే సిద్ధపడెను. రాముడు ఎంత వారించినను సీతాదేవి రాముని అనుసరించుట, సనాతన ధర్మమని భావించి అతనిని అనుసరించెను. అపుడు రాముడు నాతో వనవాసము చేయుటకై దైవముచే సృష్టించబడితివి. నన్ను అనుసరించి నాకు సహధర్మచారిణివి కమ్మని పలికెను[74]. మరియు ధర్మార్థ కామ మొక్షములయందును అతిక్రమించనుయను వైవాహిక మంత్రమును పాటించెను[75]. సీతారామలక్ష్మణులు దండకారణ్యమున పోవుచుండజడగా

---

73. *అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసుయ।*
*ద్విశ్రాయో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యోరసః॥*
*కాలేనా వరణాత్యయా, త్పరిణతే యత్స్నే హ సారే స్థితం।*
*భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హితత్ ప్రార్థ్యతే॥*
*ఉత్తర రామ చరితమ్, భవభూతి, మీరట్. 1963.1.39.*

74. *సాహి సృష్టా నవద్యాంగి వనాయ మదిరేక్షణే।*
*అనుగచ్ఛస్వమాం భీరు సహధర్మచరీ భవ॥ అయో. కా. 30.40*

75. *ధర్మేచ అర్థేచ కామేచ నీతి చరిత వ్యాత్పయేయం నాతిచరామి ఇతి వరః।*
*గోపాలకృష్ణ శర్మ, మల్లాది. రామాయణవైభవము. అనంతపురము. 1971. పు.153.*

విరాధుడను రాక్షసుడు సీతను ఎత్తుకొని ఈమె నాకు భార్య కాగలదు. ఒక వేళ మీరు ఎదిరించినచో యుద్ధమున మీ రక్తమును త్రాగెదను అనెను[76]. అపుడు రాముడు బాధపడుచు లక్ష్మణా! పరపురుషుడు సీతను స్పర్శించుటచే నాకు కల్గిన దుఃఖము తండ్రి మరణము నందును, రాజ్యము కోల్పోవుట చేతను కలుగ లేదు యని కన్నీరు గార్చెను[77]. దీనిని బట్టి వారి దాంపత్య సంబంధము ఎటువంటిదో మనకు తెలియుచున్నది.

తర్వాత దండ కారణ్యమున ఆశ్రమమందు సీతాపహరమము జరిగిన పిదప రాముడు సీతను గూర్చి అనేక విధముల దుఃఖించెను. తర్వాత శ్రీరాముడు సీత కొరకు వెదకి వెదకి పిమ్మట లక్ష్మణునితో నిట్లు చెప్పెను. లక్ష్మణా! యక్షులుగాని, గందర్వులుగాని, పిశాచులుగాని, రాక్షసులు గాని, కిన్నరులుగాని, దేవతలుగాని, మనుజులుగాని సీతను నాకు అప్పగించక పోయినచో నా తేజముచే లేక పరాక్రమముచే వారు సుఖము నొందజాలరు[78]. నేను వింటిని ఎక్కుపెట్టి బాణములు విడువగ ప్రాణులు ఆకాశమున ఎగురలేవు. మరియు ప్రకృతికి విరుద్ధముగ స్థితిని కలుగజేసెదను. ఇట్లు

---

76. ఇయం నారీ వరారోహ మమ భార్యా భవిష్యతి।
యువయోః పావయోశ్చాహం పాస్యామి రుధిరం మృధే॥ అర.కా.2.14

77. పరస్పర్శాత్తు వైదేహ్యా నదుఃఖతర మస్తిమే।
పితుర్వియోగా త్సౌమిత్రే స్వరాజ్య హరణాత్తథా॥అందులోనే. 2.20

78. దైవ దేవాః నదైతేయా న పిశాచా నరాక్షసాః।
భవిష్యన్తి మమ క్రోధాత్ త్రైలోక్యేపి ప్రణాసితే॥ అందులోనే. 64.58

సీతను గూర్చి అనేక విధములుగ దుఃశించుట వలన రామునకు సీతపై గల ప్రేమానురాగాలు మనకు తెలియుచున్నవి. మరియు జనకుడు సీతను గూర్చి నన్ను అడిగినచో నేనేమి చెప్పెదను. ఆమెను ఎడబాసి నేనెట్లు జీవింతును[79]. సీత అడవిలో దుఃఖమును భరించుచుకూడ తన దుఃఖమును పైకి కనబడనీయక నాతో దుఃఖము లేని దానివలె చక్కగా మాటలాడును[80]. ఒకవేళ అయోధ్యకు వెళ్ళినచో మా తల్లికి నేనేమి చెప్పెదను అని సీతను గూర్చి అనేక విధముల బాధపడుటను బట్టి సీతారాముల దాంపత్య జీవితం ఏలాంటిదో మనకు విదితమగుచున్నది.

మరియు భవభూతి తన ఉత్తర రామ చరితమునందు వారి దాంపత్య సంబంధం గూర్చి విపులముగా వివరించెను. చిత్ర దర్శన సందర్భమున సీతను తలచుకొన్న రాముడు ఇట్లు చెప్పెను. పెండ్లి సమయము నుండి ఇంటి యందును, వనమునందును, బాల్యమునందును, యౌవ్వనమునందును మరియు నీవెందున్నను నా బాహువు నీకు ఎప్పుడును నిద్రకు కారణమైనది. మరియు ఈ కల్యాణి నా గృహ లక్ష్మి. నా కన్నులకు అమృతము వంటిది. నా కన్నులకు ఆనందమును కలుగజేయును. చందన రసము వలె ఈమె స్పర్శ

---

79. *తయా విహీనః కృపణః కథం లక్ష్మణ ధారయే।*
*యా మా మనుగతా రాజ్యాద్భ్రష్టం విగత చేతనమ్॥ కి.కా. 1.108.*

80. *ప్రాప్య దుఃఖం వనేశ్యామా సామాం మన్మథ వికర్శితం।*
*నష్ట దుఃఖేవ హృష్టేవ సాధ్వీసా భ్యభ్య భాషత॥ అందులోనే. 1.111*

చల్లగా యుండును. ఈమెలో ఉన్న ప్రతి అంగము నాకు అత్యంత ప్రియమైనది. కాని విరహమొక్కటే ఓర్వజాలనిది[81]. అని ఆమెను తలచుచు అనేక విధముల దుఃఖించెను.

మరియు సీతను గూర్చి రాముడిట్లు తలంచెను. సీతా! నీ వలన లోకములు పావనములైనవి. కాని లోకుల మాటలు పావనములు కాక యున్నవి. లోకముల కెల్లను నీవేరక్ష. గాని నీవు మాత్రము అనాథయై ఆపద చెందుచున్నావు[82]. నా రక్షకుడుయను విశ్వాసం చేత నీవు నాపై వ్రాలి నిద్రించితివి. నీవు ఇంటికి దీపము వంటిది. అయినను భయపడుచున్న, నిండు చూలాలుగా యున్న నిన్ను ఇపుడు పచ్చిమాంసమును తిను క్రూరమైన జంతువులకు పారవేయుచున్నాను[83]. అనగా క్రూరమైన అడవిలో వదలి వేయుచున్నాను అని అనేక విధముల దుఃఖించుటను బట్టి రామునకు సీతయందు గల ఆదరాభిమానములు మనకు తెలియుచున్నవు.

---

81. *అవివాహ సమయాత్ గృహే వనే*
*శైశవే తదను యౌవనే పునః।*
*స్వాప హేతు రను పాశ్రితోఽన్యయా*
*రామ బాహు రుపదాన మేషతే॥*
*ఇయంగేహే లక్ష్మీరియ మమృత వర్తిర్నయనయో।*
*రసావ స్యాస్స్పర్శో వపుషి బహుళ శ్చందనరసః॥*
*అయం కంఠే బాహుః శిశిరమసృణో మౌక్తిక సరః।*
*కిమస్యానప్రేయో యది పర మసహ్యాస్తు విరహః॥* ఉ.రా.చ.1.30–31

82. *త్వయా జగన్తి పుణ్యాని త్వయ్యపుణ్యా జనోక్తయః।*
*నాథ వంత స్త్వయాలోకా స్త్వమనాథా విపత్స్యసే॥* అందులోనే. 1.36

83. *విస్రమ్భాదురసి నిపత్య జాతనిద్రా*
*మున్ముచ్య ప్రియగృహిణీం గృహస్య లక్ష్మీం।*
*ఆతంక స్ఫురిత కఠోర గర్భ గుర్వీం క్రవ్యాద్భ్యో*
*బలిమివ నిర్ఘృణః క్షిపామి॥* అందులోనే. 1.42.

మరియు సీతారాముల సంబంధం మానవాళికి ఆదర్శము. ఎట్లనగా ప్రియమైన జనము తానేమియు చేయకయే, సన్నిధి మాత్రము చేతనే సుఖములు కల్గించి దుఃఖములు పోగొట్టును. అది ఇట్టిదియని చెప్పరాని ద్రవ్యము లేక మందు. ఈ విధమైన రాముని వచనములు నాటి నుండి నేటి వరకు భార్యభర్తల మధ్యగల సంబంధానికి నిదర్శనమగుచున్నవి[84].

తర్వాత పంచవటీ ప్రాంత దర్శన సందర్భమున రాముడు సీతను తలచుకొని దుఃఖితుడై మూర్ఛిల్లెను. సీత స్పర్శ చేత తేరుకొన్నవాడై మరల ఇట్లు తలంచెను. ఈ స్పర్శతప్పక నన్ను మూర్ఛనుండి తేర్చునదిగాను, మనస్సునకు మైమరపు కల్గించునదిగా యున్నది. ఆ స్పర్శ సోకగానే దుఃఖం వలన కల్గిన మూర్ఛను ఇపుడె తొలగించి, మరల ఆనందం వలన నాకు మైమరపు కల్గినట్లున్నది[85]. మరియు నా గుండె భయముచే రెండుగా పగులుచున్నది. కాని రెండుగ కాదాయెను. దేహము వసము తప్పినదై మూర్ఛను పొందుచున్నది. కాని ప్రాణము వీడలేదు. కడుపులోని మంట దేహమును కాల్చుచున్నది. కాని బూడిద కాదాయెను. విధి నా ఆయువు పట్టును కోయునట్లున్నది. కాని ఆయువును కోయలేదు[86]. మరియు ఓ సీతా! నా గుండె పగిలిపోవుచున్నది.

---

*84. నకించిదపి కుర్వాణః సౌఖ్యై దుఃఖా వ్యపోహతి।*
*తత్తస్య కిమపి ద్రవ్యం యోహి యస్య ప్రియో జనః॥ ఉ. రా. చ. 2.19.*

*85. స్పర్శః పురాపరిచితో నియతం స ఏష*
*సంజీవనశ్చ మనసః పరిమోహనశ్చ।*
*సంతాపజాం సపదియః ప్రతిహత్యమూర్ఛా*
*ఆనంద నేన జడతాం పునరాతనోతి॥ అందులోనే. 3.7*

*86. దళతి హృదయం శోకోద్వేగాద్ ద్విధాతు న భిద్యతే*
*వహతి వికలః కాయో మోహం నముంచతి చేతనాం।*
*జ్వలయతి తనూమన్తర్దాహః కరోతిన భస్మసాః*
*ప్రహరతి విధి ర్మర్మచ్ఛేదీ న కృంతతి జీవితం ॥ అందులోనే. 3.25*

నా దేహమున అన్ని బంధములు నాశనమగుచున్నవి. నాకు చుట్టును లోకము పాడు పడినట్లు తోచుచున్నది. లోపల ఆగక పైకి ఎగియుచున్న మంటలతో నేను కాలి పోవుచున్నాను. నా అంతరాత్మ నాకు వసము తప్పి పెను చీకటిలో మునిగి పోవుచున్నట్లున్నది. మూర్ఛయును నన్ను కమ్ముకొనుచున్నది. అయ్యో! దురదృష్టవంతుడను. ఇపుడు నేనేమి చేయగలను[87]. ఈ విధంగా రాముడు సీతను తలచుకొని అనేక విధముల దుఃఖించుటను బట్టి రామాయణము సీతారాముల అన్యోన్య దాంపత్య జీవితం, ప్రేమ, ఆదరాభిమానములు ఎటువంటి వో మనకు తెలియుచున్నది.

మరియు సీత కూడ ఎప్పుడును తన భర్తకు ఎదురు మాట్లాడక సదా అతనినే అనువర్తించెను. రాజైన జనకుని కుమార్తెయై యుండి, అరణ్యమునకు బయలుదేరు సందర్భము మొదలుకొని మరల అయోధ్యకు తిరిగి వచ్చువరకు ఎచటను రాముని నిందించినట్లు రామాయణమున లేదు. తిరిగి మరల దండకారణ్యమునకు పంపబడినప్పటికి ఇది నాతల వ్రాతయని దుఃఖించినది. ఏనాడు నాకు రాముడు అన్యాయం చేశాడనికాని, కనీసం నిందాస్తుతియైనను ఆమె చేయలేదు. దీనిని బట్టి రామాయణమునందు సీతారాముల అన్యోన్య దాంపత్య జీవితం లేదా ఆనాటి భార్యా భర్తలు ఏ విధంగా ఉన్నది మనకు తెలియుచున్నది. నాటి సమాజంలో కూడ స్త్రీకి ప్రాధాన్యత లేనట్లు మనకు పైకి కనిపించినను ఏనాడు రాముడు సీతను గూర్చి నిందించలేదు. సీతకు ఇలాంటి కష్టములు కల్గినవని ఆవేదన చెందాడే గాని ఇతరమైన భావన అతని

---

87. *హాహాదేవీ! స్ఫుటతి హృదయం ధ్వంసతే దేహబంధః*
*శూన్యం మన్యే జగదవిరత జ్వాల మంతర్జ్వలామి।*
*సీదన్నన్ధే తమసి విధురో మజ్జతీ వాంతరాత్మాః*
*విష్వన్ మోహాస్థగయతి కథం మంద భాగ్యః కరోమి॥ ఉ.రా.చ. 3.32.*

మనసులో లేదు. నిన్ను పెండ్లి చేసుకొన్నది మొదలు కష్టములు కల్గెనని ఏనాడు సీతను గూర్చి ప్రత్యక్ష పరోక్షములుగా ఎచటన అనినట్లు ఆనవాలు లేదు.

మరి ఈనాడు అట్లుకాక దీనికి భిన్నమైయున్నది. ఎందుకనగా విద్యాపరంగా, ఆర్థికపరంగా, సామాజికపరంగా ఎదిగిన కారణంచే స్త్రీలు భర్త మనోభావాలను లెక్క చేయక వ్యవహరించటము జరుగుచున్నది. మరికొందరు అజ్ఞానులై అహంకారులై తమ కుటుంబములను నాశనం చేసుకొనుటయు మనం చూచుచున్నాము. పెండ్లయిన మరుక్షణమే భర్త తరపున ఎవరిని లెక్క చేయక కించపరచుట కూడా లోకంలో జరుగుచున్నది. మరి సీత ఒక రాకుమార్తెయై యుండి అన్ని కష్టములందును భర్తను అనుసరించెను. మరి వారికి సంపదలు లేవా? ఎటిట సందర్భములలోను ఒకరినొకరు నిందించుకొనలేదు. మరి ఈనాడు ఏమి జరుగుతున్నదో పాఠకులకు విదితమే.

మరియు మనము ఈనాడు ఎంత విద్యా, ఆర్థిక, సామాజిక పరంగా అభివృద్ధి చెందినను, భార్యాభర్తలు ఒకర్పై ఒకరు అనుమానములు వీడి, సహనంతో సాదారాభిమానములతో కలసి మెలసి జీవించుటలో ఉన్న సౌఖ్యం మరెచటను లేదు. మనసునకు ధనప్రధానం కంటె ప్రేమాభిమానములు ముఖ్యం. ఎంత ఉన్నను చివరకు అభిమానం చూపించువారు లేకున్న జీవించుయు చచ్చిన వారితో సమానము. కావున మనమున్నంత వరకు మన పరిథిలో మన జీవితంను సుఖమయం చేసుకొంటే దానికి మించిన పరమార్థం మరియొకటి లేదు. రామాయణము నందు భార్యాభర్తల సంబంధం, వారు ఒకర్పై ఒకరు చూపుకొన్న ప్రేమాభిమానములు చక్కగా వివరించబడినవి. అందువలననే వారి జీవితం సుఖమయమైనది. కావున నిజ జీవితంలో రామాయణంలో చెప్పబడిన విషయాలు నాటి మొదలు నేటి వరకును ఇంకను మానవులు ఆచిరించినచో వారి జీవితం సుఖమయం అవుతోంది.

# రెండవ భాగము

## వాల్మీకి రామాయణంలోని నీతి వాక్యాలు

అతి ప్రాచీన కావ్యమైన రామాయణమునందు హితోపదేశతుల్యమగు నీతి బోధకమైన శ్లోకాలు అనేకం కలవు. అవి రామాయణంలోని అన్ని కాండలలోను వ్యాప్తమైయున్నవి. వాటిని క్షుణ్ణంగా పరిశీలించినచో, వాటిని మూడు విధములుగా విభజించుకొనవచ్చును. అవి (1) రాజనీతికి సంబంధించిన నీతి వాక్యాలు. (2) భార్యాభర్తలకు సంబంధించిన నీతి వాక్యాలు, (3) ప్రజలకు సంబంధించిన నీతి వాక్యాలు. శ్రీ మద్వాల్మీకి రామాయణమునందు ఈ నీతికి సంబంధించిన వాటిని గూర్చి ఇచట క్లుప్తంగా పొందుపరచడం జరిగింది.

## 1. రాజనీతికి సంబంధించినవి

రాజు ధర్మార్థ కామములకు మూలము. రాజ్యమందు రాజుకు, మంత్రులకు, కుటుంబ సభ్యులకు, ప్రజలకు మంచి అవగాహన ఉన్నప్పుడే ఆ రాజు రాజ్యపాలన చక్కగా చేయగలడు. రామాయణమున వర్ణించబడిన రాజులు ప్రజలకోసం (అనగా ప్రజల హితోపకారియై) రాజ్యమును పరిపాలించిరి. ఉదాహరణకు ఉత్తరరామచరితము నందు.

స్నేహం దయాం తథా సౌఖ్యం యదినా జానకీమపి।
ఆరాధనాయలోకస్య ముంచతోనాస్తి మే వ్యథా॥

అను శ్లోకమును బట్టి ఇక్ష్వాకు రాజులు ప్రజాక్షేమం కోసం తమ భార్యలను సైతము వదిలి వేయుటలో వారికి దుఃఖం లేదు. దీనిని బట్టి వారు ప్రజల

కొరకే రాజ్యమును పరిపాలించినట్లు మనకు తెలియుచున్నది. రామాయణము నందు వాల్మీకి రాజులకు సంబంధించిన అనేక నీతులను వివరించాడు. అందులోను ప్రధానమైన కొన్ని రాజనీతికి సంబంధించిన వాక్యాలు లేక పద్యాలు ఇందు పొందు పరచుచున్నాను. ఈ నీతికి సంబంధించిన వాక్యాలు చాల పురాతనమైనప్పటికి నేటి పాలకులకు ప్రజలకు మధ్యగల సంబంధాలను తెలియజేస్తూ అందరికి ఆదర్శవంతంగా ఉన్నాయి.

ఇందులోనే ఈ నీతి వాక్యాల భావము గూడ వ్రాయబడినది. దాని వలన పాఠకులకు మరింత చేరువ కాగలదని నా భావన. మరియు రాజు గుణములను ప్రజలకుండవలసిన గుణములను చక్కగా తెలియజేయడం జరిగింది.

1. ఏవంహి భవితా రాష్ట్రం యత్ర రాజా న దృశ్యతే। అయో.కా. 14.57
   రాజులేని రాజ్యము శోభను చెందక వృద్ధి చెందక నశించును.

2. బుద్ధియుక్తాహి పురుషా న సహంతే పరస్తవం। అయో.కా. 26.25.
   బుద్ధిమంతులు ఇతరులు తమ్ము స్తుతించిన సహించరు.

3. సమర్థాన్ సంప్రగృహ్ణంతి జనానపి జనాధిపాః। అయో.కా. 26.36.
   రాజులు సమర్థులైనవారు సాధారణ జనులైనను స్వీకరింతురు.

4. న వరేణ్యా ఉపహృతం భక్ష్యం వ్యాఘ్రః భారితు మిచ్ఛతి।
   అయో.కా. 61.16.
   ఇతర జంతువులు తిన్న మాంసమును వ్యాఘ్రము (పులి) ముట్టదు.
   (అదేవిధంగా రాముడు ఇతరులు అనుభవించిన సంపదను నాదరింపడు).

5. ఆగోపాలా యథాగావః తథా రాష్ట్రమరాజకమ్। అయో.కా. 67.29
   రాజు లేని రాజ్యము గోపాలుడు లేని గోవులవంటిది.

6. పూర్వాపకారిణాం త్యాగేన హ్యధర్మో విధీయతే। అయో.కా. 96.23
ముందుగా అపకారము చేసిన వారిని శిక్షించుటలో అధర్మము లేదు.

7. యద్వృత్తాస్సంతి రాజానస్తద్వృత్తాస్సంతి హి ప్రజాః। అయో.కా. 109.9.
రాజులెట్లు నడచుకొందురో ప్రజలు అట్లే ప్రవర్తించుదురు.

8. అస్వాధీనా నరేంద్రాణాం ప్రాకృతైస్తే జనైః సమాః। అర.కా. 33.9
ఎవరిని తమ ఆధీనమందు ఉంచుకొనలేని రాజులు సాధారణ మానవతుల్యులు.

9. శఠమ్వ్యసనే సర్వభూతాని నాభిధావంతి పార్థివమ్। అర.కా. 33.15
ఇతరులకు హానిని తలపెట్టు రాజును కష్టసమయమున ఎవరు ఆదుకొనరు.

10. నతు స్థానాత్పరిభ్రష్టైః కార్యం స్యాద్వసుధాధిపైః। అర.కా. 33.18
పదవీచ్యుతులైన రాజు వలన ఎట్టి ప్రయోజనం ఉండదు.

11. ఏవం రాజ్యాత్పరిభ్రష్టః సమర్థోఽపి నిరర్థకః। అర.కా. 33.19
స్థాన భ్రష్టుడైన రాజు శక్తి సామర్థ్యములు కలిగియున్నను వ్యర్థుడు.

12. కృతజ్ఞో ధర్మశీలశ్చ స రాజా తిష్ఠతే చిరమ్। అర.కా. 33.20
చేసిన మేలు మరువక ధర్మగుణము కల్గియుండు రాజు చిరకాలము పదవియందుండును.

13. వ్యసనం స్వామివైగుణ్యాత్ ప్రాప్నువంతీతరేజనాః। అర.కా. 41.9
జనులు రాజుయొక్క దుర్గుణము వలన కష్టమును పొందుదురు.

14. తస్మాత్ సర్వాస్వవస్థాసు రక్షితవ్యాః నరాధిపాః। అర.కా. 41.10
సర్వావస్థలయందును రాజులు రక్షింపతగినవారు.

15. యథాత్మన స్తథాఽన్యేషాం దారా రక్ష్యా విపశ్చితా। అర.కా. 50.7

పర పురుషుడు తాకకుండా తన భార్యనెట్లు రక్షించుకొనునో అట్లే విద్వాంసుడగువాడు ఇతరుని భార్యను కూడా కాపాడవలయును.

16. రాజా ధర్మస్య కామస్య ద్రవ్యాణాం చోత్తమో నిధిః। అర.కా. 50.9
రాజు ధర్మార్థకామములకు మూలము.

17. తదన్నమపిభోక్తవ్యం జీర్యతే య దనామయమ్। అర.కా. 50.17
ఎంత అన్నము జీర్ణమై శరీరమునకు హితము గూర్చునో అంత అన్నమే తినవలయును.

18. ఉత్సాహవంతోహి నరానలోకేసీదన్తి కర్మస్వతిదుష్కరేషు। అర.కా. 63.19
లోకమున ఉత్సాహవంతులెన్నడును అతిదుష్కరకార్యములు సాధించుటలో సయితము పరాజయము పొందురు.

19. పార్థివానాం గుణారాజన్ దండశ్చాప్యప కారిషు। కి.కా. 17.17
అపరాధులను దండించుట రాజుల కుండవలసిన లక్షణము.

20. కృతజ్ఞః సత్యవాదీచ రాజాలోకే మహీయతే। కి.కా. 34.7.
సత్యమునే చెప్పుచు చేసిన మేలు మరువకయుండు రాజు ఈ లోకమున మెప్పునొందును.

21. అసద్వృత్తేహి నృపతావకాలే మ్రియతేజనః। ఉ.కా. 73.16.
రాజు దుర్మార్గవర్తనుడైనచో జనులు అకాలమున (ముసలితనము పొందకయే) మరణింతురు.

22. సదండో విధి వన్ముక్తః స్వర్గం నయతి పార్థివమ్। ఉ.కా.79.9.
సక్రమముగా అపరాధిని రాజైనవాడు శిక్షించినచో యట్టి ఉత్తమకార్యము కారణముగా రాజు స్వర్గమునకుపోవును.

## 2. భార్యాభర్తలకు సంబంధించినవి

రామాయణమునందు వర్ణించబడిన భార్యాభర్తల సంబంధం లోక ప్రసిద్ధమైనది. ఇది మానవలోకానికే ఆదర్శవంతమైనది. రామాయణమునందు భార్యాభర్తల మధ్య ఎచటను ఒకరినొకరు కనీసం ఎదిరించి మాట్లాడడం, నిందించుకోవడం గాని లేదు. వారి అన్యోన్య దాంపత్య జీవితం ప్రజలకు నాటికి, నేటికి అద్దం పడుతున్నట్లుంది. భార్యాభర్తల దాంపత్య జీవితానికి సంబంధించిన అనేక నీతి వాక్యాలు రామాయణంలో మనకు కన్పిస్తున్నవి. ఆనీతి వాక్యాలు క్లుప్తంగా ఇచట వివరించబడినవి.

1. భర్తుః శుశ్రూషయా నారీలభతే స్వర్గముత్తమమ్। అయో.కా 24.26
   స్త్రీ భర్తకు సేవచేయుట ద్వారా స్వర్గము నొందును.

2. భర్తుర్భాగ్యంతు నార్యేకా ప్రాప్నోతి పురుషర్షభ। అయో.కా.27.4
   భర్త యొక్క ఐశ్వర్యమును భార్య యొక్కతయే అనుభవించును.

3. భర్తు, రిచ్ఛా హి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే। అయో.కా.35.8.
   స్త్రీలకు కోటిమంది కుమారులకంటె భర్తకోరికయే (భర్త అభిప్రాయ ప్రకారం నడుచు కొనుటయే) విశిష్టమైనది.

4. ఆత్మాహి దారాః సర్వేషాం దారసంగ్రహ వర్తినాం।అయో.కా.37.24
   గృహస్థులెల్లరకు భార్యయో ఆత్మ.

5. స్త్రీణాం పవిత్రం పరమం పతిరేకో విశిష్యతే। అయో.కా.39.24
   ఉత్తమ స్త్రీలకు అన్ని విధముల ప్రధాన భూతుడు భర్తయే.

6. నాపతిః సుఖమేధేత యా స్యాదపి శతాత్మజా। అయో.కా.39.29
నూరుమంది కుమారులుండినను భర్తలేని స్త్రీ సుఖముగ నుండ జాలదు.

7. అమితస్యతు దాతారం భర్తారం కాన పూజయేత్। అయో.కా.39.30
అమితమైనదానిని (ఇహపరలోక సుఖములకు సంబంధించిన వాటిని) ఇచ్చునట్టి భర్తను ఏ స్త్రీ పూజింపదు.

## 3. ప్రజలకు సంబంధించినవి

రామాయణమునందు ''యథారాజా తథా ప్రజా'' యన్నట్లు రాజాలు ఎంత నీతివంతులో ప్రజలు కూడ అట్లే నిత్య ధర్మ పరాయణులు. ఎచటను అధర్మమనునది కానరాదు. ముఖ్యంగా రాముని పరిపాలనయందు ప్రజలు ఎల్లప్పుడు ఈతి బాధలు లేక సుఖశాంతులతో, ఈర్ష్యా ద్వేషములు లేక ఆదరాభిమానములతో కలసి మెలసి యున్నట్లు మనకు తెలియుచున్నది. ప్రజలు తరతమ భేదములు లేక అన్యోన్యంగా జీవించుచుండిరి. శ్రీమద్రామాయణమునందు ప్రజలకు సంబంధించిన నీతి వాక్యములు అనేకం. ఈ నీతి వాక్యాలు నాటి కాలమునకేకాక నేటి కాలమునకు గూడ ఆదర్శవంతమైనవి. మరియు మిక్కిలి ప్రశంసనీయమైనవి కూడ. నేటికి వాటి విలువ ఇంతయని చెప్పనలవి కాదు. ఆ సదుద్దేశంతోనే రామాయణంలోని ప్రజలకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన నీతి వాక్యాలు ఇందువివరించడం జరిగింది.

1. అనిషిద్ధ సుఖత్యాగీ పశువరే న సంశయః। బా.కా.
నిషిద్ధములు కాని సుఖములను వదలుకొనువాడు పశువే.

2. పరప్రవాసే హి వదం త్యనత్తమం తపోధనాస్సత్యవచో హితం నృణాం। అయో.కా. 11.29
సత్యమే మనుష్యులకు స్వర్గలోక ప్రాప్తికి హేతువని ఋషులు చెప్పెనారు.

3. సత్యం హి పరమం ధర్మం। అయో.కా. 14.3.
ధర్మ మెరిగిన వారికి సత్యము గొప్ప ధర్మము.

4. మృదుర్హి పరిభూయతే। అయో.కా. 21.11.
మెత్తని స్వభావము కలవాడు అవమానింపబడును.

5. ధర్మోహి పరమోలోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్। అయో.కా. 21.4.
లోకమున సకల పురుషార్థములలో ధర్మమ ఉత్కృష్టమైనది.

6. గురు వృత్త్యనురోధేన నకించి దపి దుర్లభమ్। అయో.కా. 30.36.
గురు శుశ్రూషా ధర్మము ననుసరించినచో ఏదియు దుర్లభము కాదు.

7. ''న హీ నింబాత్ ప్రవేత్ క్షౌత్రం''. అయో.కా. 35.15.
వేప నుండి తేనె కారదు.

8. శోకోనాశయతే సర్వం నాస్తి శోక సమోరిపుః। అయో.కా. 62-15.
శోకము అంతను నశింపజేయును. కాన శోకముతో సమానమైన శత్రువు లేదు.

9. ఆత్మనో నావబుధ్యన్తే మనుష్యా జీవితక్షయమ్। అయో.కా. 105-24.
మనుష్యులు తమ జీవితము క్షయించుచున్నదని ఎరుగరు.

10. ధర్మసాద మిదం జగత్। అర.కా. 9.30
ఈ ప్రపంచమున ధర్మమే సారము.

11. రాజాత్పరిభ్రష్టః సమర్థోపి నిరర్థకః। అర.కా. 33.19
రాజ్యభ్రష్టుడైన రాజు సమర్థుడైనను నిష్ప్రయోజనుడే.

12. ముమూర్షూణాం హి సర్వేషాం యత్పథ్యం తన్న రోచతే। అర.కా. 53-17.
మృత్యువు సమీపించిన వానికి హితమెంతమాత్రము రుచింపదు.

13. నిర్దోషశ్చ సదోషశ్చ వయస్యః పరమాగతిః। కి.కా. 8.8.
నిర్దోషిగాని దోషిగాని స్నేహితుడే సహాయమునొసంగువాడు.

14. శోచతే వ్యవసీదంతి సర్వార్థ। కి.కా. 27.34.
వ్యసనములందు లగ్నుడగువానికి అన్ని కార్యములు చెడును.

15. పానాదర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే। కి.కా. 33.45
మద్యపానము వలన ధర్మార్థ కామములు నాశనమగును.

16. మనోహి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే। సు.కా. 11.41
మనస్సే సర్వేంద్రియ ప్రవర్తనకు హేతువు.

17. యదతీతం పునర్నైతి స్రోతః స్రోతస్వినామివ। సు.కా.20.12
నదీ ప్రవాహమువలెపోయినదేదియు (గడచినయౌవనము) తిరిగిరాదు.

18. ఇచ్ఛతీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా। సు.కా. 22.42
తన్ను ప్రేమించు వనితను కామించువానికి మిక్కిలి ప్రీతి చేకూరును.

19. క్రుద్ధః పరుషయావాచా నర స్సాధూ నధిక్షిపేత్। సు.కా. 55.4.
కోపించిన నరుడు పరుష మాటలచే సత్పురుషులను నిందించును.

20. నాగ్నిరగ్నీ ప్రవర్తతే। సు.కా. 55.23
అగ్ని అగ్నిని దహింపదు కదా!.

21. సర్వే చండస్య బిభ్యతి। యు.కా. 2.20.
అందరు చండునికి భయపడుదురు.

22. నీచే నాత్మాపచారేణ కులం తేన వినశ్యతి। యు.కా.38.7
నీచుడు చేసిన అపచారమునకు ఫలముగా అతడొకడేకాగ అతని వంశమంతయు నశించును.

23. గతంతు గతమేవహి। యు.కా. 63.25
గడచినది గడచినదేయగును కాని మరల రాదు కదా.

24. న కత్థనాత్ సత్పురుషా భవంతి। యు.కా. 71.58
ఆత్మశ్లాఘనముచే సత్పురుషులు కానేరరు.

25. పౌరుషేణతుయో యుక్తః సతుశూర ఇతి స్మృతః । యు.కా. 71.59
పౌరుషము కలవాడే శూరుడు.

26. అధనేనార్థ కామేన నార్థః శక్యో విచిన్వతా। యు.కా. 83.38
ధనము లేనివాడు తనయభివృద్ధిని ఎంతగా కోరుకున్నను అది లభించదు.

27. శుభకృచ్ఛుభ మాప్నోతి పాప కృత్పాపమశ్నుతే। యు.కా. 111.26
శుభముల నాచరించిన వాడు సుఖముల నొందును. పాపముల నాచరించిన వాడు కష్టములు నొందును.

28. కీర్త్యర్థం తు సమారంభః సర్వేషాం సుమహాత్మనామ్। ఉ.కా. 45.13 -
మహాత్ములు ఏ కార్యారంభమునైనను చేపట్టుట కీర్తికొరకే.

# ఉపయుక్త గ్రంథావళి


1. శ్రీమద్వాల్మీకి రామాయణం
నారాయణ స్వామి అయ్యర్. ఆర్.
మద్రాసు - 1993.

2. శ్రీమద్వాల్మీకి రామాయణం
శివరామ శర్మ వశిష్ఠః. పి.
చౌఖాంబా విద్యాభవన్
వారణాసి - 1957

3. శ్రీమద్వాల్మీకి రామాయణం
వాణి విలాస్ ముద్రణాలయము
శ్రీ రంగమ్ - 1917.

4. శ్రీమద్రామాయణం
వేంకట శేషాచార్యులు, చలమచర్ల.
బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండములు
జయలక్ష్మీ పబ్లికేషన్సు
హైదరాబాదు.

5. రామాయణ సుధాలహరి
(ఉపన్యాస మంజరి)
తి.తి. దేవస్థానములు
తిరుపతి - 1984.

6. గోపాల్ రెడ్డి, ముదిగంటి
సంస్కృత సాహిత్య చరిత్ర
తెలుగు విశ్వ విద్యాలయం
హైదరాబాదు - 1986.

7. ప్రతాప్ రెడ్డి, సురవరం
రామాయణ విశేషములు
హైదరాబాదు 1987.

8. భవభూతి
ఉత్తర రామచరితమ్
వారణాసి, 1990.

9. మౌలాలీ, షేక్
రామాయణ పాత్రలు
గుంటూరు - 1993.

10. రఘునాథాచార్య, ఎస్.బి.
జననీ జన్మ భూమిశ్చ
యువ భారతి
సికింద్రాబాద్ - 1984

11. రఘునాథాచార్య. ఎస్.బి.
రామ విజయః
తిరుపతి - 1976

12. రామబ్రహ్మం, బేతవోలు
వాల్మీకి రామాయణం
కొండపల్లి విజయకుమార్ పబ్లిషర్స్
రాజమండ్రి - 1983.

# సంకేత పదసూచి

| | | |
|---|---|---|
| అయో.కా. | : | అయోధ్యకాండ |
| అర.కా | : | అరణ్యకాండ |
| ఉ.కా. | : | ఉత్తరకాండ |
| ఉ.రా.చ. | : | ఉత్తర రామచరితం |
| కి.కా. | : | కిష్కింధ కాండ |
| బా.కా. | : | బాలకాండ |
| యుద్ధ.కా. | : | యుద్ధకాండ |
| శ్రీ.వా.రా. | : | శ్రీమద్వాల్మీకి రామాయణం |
| స.సా.చ. | : | సంస్కృతసాహిత్య చరిత్ర |
| సుం.కా. | : | సుందర కాండ |

